# కవికొండల
# వేంకటరావు గేయాలు

రచన

ఆంధ్రావర్డ్సువర్తు '—' కథకచక్రవర్తి '

**శ్రీ కవికొండల వేంకటరావు B. A., B. L.,**

ప్రకాశకులు

**కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్,**

సంస్కృతాంధ్ర బుక్‌డిపో (స్థా. 1882) రాజమండ్రి.

సర్వస్వామ్యములు
గ్రంథప్రకాశకులవి
ప్రథమ ముద్రణ
1 డిశంబరు 1960
—* : అచ్చు : *—
రాజేశ్వరి ప్రెస్
రాజమహేంద్రవరం

ముఖచిత్ర రచన
—* యమ్. రాజాజి *—
రామారావు స్కూల్ ఆఫ్ ఆర్ట్సు
ప్రిన్సిపాల్ : : : : రాజమండ్రి.

వెల 2-50

# విషయసూచిక


1 సంబోధనము
2 త్యాగము
3 నైరాశ్యము
4 గీత
5 శూన్యత
6 ప్రణయ తత్వము
7 మబ్బు - గాలి
8 ఉదంతము
9 మర్మము
10 ఉత్కంఠ
11 వెళ్లిపోనీదారి
12 తెగవేమే? నగవేమే?
13 పీఠిక
14 పోనీలే!
15 నాదావ
16 రానిదాన్ని
17 సిగ్గు - యెగ్గు
18 మూపు
19 పైరుగాలి
20 హొట్టేలు
21 జ్యోతి
22 అబ్బా!
23 ఎక్కడికి?
24 పోలేరమ్మ
25 సామరస్యము
26 రంగు - చెంగు
27 విస్మృతి
28 ఒత్తిగిల్తే
29 వళ
30 మిఠారి
31 ఓనాడు
32 చెలోభాయీ!
33 పేమ
34 వావిదా?
35 కోకిలమగడు
36 బంతిపూలు
37 కారెంపాట
38 సంబరంగాడు
39 తోయదయస్వామిప్రభూ!
40 లీల
41 సూక్ష్మము
42 సత్కృతి
43 భాష్పములు
44 సాయిలాయి - జాయిలాయి
45 ఒకనాటి యూహ
46 కిట్టము
47 సమస్య
48 చెంబేలీ
49 ఉయ్యాలెవరు వేసిరో
50 వానమబ్బా నీకు స్వాగతము
51 రహస్యము
52 పెట్టి ఉయ్యాలా
53 స్మృతి
54 ఇక్కడ
55 చుక్కల్ల చూపులా
56 సొంతచలవ
57 చూదే
58 వెన్నెలవు

59 అంతా
60 నిశ్శబ్ద వీణపై నిర్వాణగీతి
61 ఎన్నియున్నాయో :
62 తొలితొలి - మలిమలి
63 పరమ సంతోషంబు
64 అద్దము
65 శుష్క
66 కలతను నాయువు
67 మిన్ను చుక్క
68 ఎగుడూ దిగుడూ
69 వేగుబోక
70 డిండీర సూత్రము
71 కొత్త - పాత
72 నదీజిజ్ఞాస
73 క్షణాక్షణము
74 వరదనే పసరికపాము
75 ఎవని పాదధూళి
76 తోకచుక్క
77 మహాదృశ్యము
78 ఉన్నావ నీవచట ?
79 పక్షి. పాంథుడు. పరమేశ్వరుడు
80 నిజమే ? నిజమే ?
81 అప్పన్న
82 నా మంచిపాట
83 పయ్యాటా ! తియపాటా !
84 వరదనేయునటి మొక్క మొలు
85 ఆకాశ మాకాశ
86 చికిలి బంగరు అంచు
87 సుకారిపిల్ల
88 ఒకనర్మము
89 దాక్కొని వుంటాయి
90 వెన్నెలా :
91 కాంతి - శాంతి
92 కొండగద్ద
93 ఎన్నిచినుకలు
94 ఏనుగుబోలి
95 మాయూరిలో మేఘం
96 చెట్టుపైన నేను పిలుస
97 మేలిపాట
98 సంప్రపన్నము
99 తపాలపరుగు
100 కాంతి
101 మృగశిర
102 రంగురంగుల పూలు
103 నక్కా సాయిగాడు
104 ఓ చిన్ని ! ఓ చిన్ని !
105 మొదలు
106 నిగ్రహము
107 చిన్నప్పుడు
108 బ్రహ్మసృష్టి
109 అంబ
110 అనాదు
111 వెంకటిపెళ్ళాం అప్పుండేది
112 పిపలు - ఆత్మలు
113 నాశాంతం - నాసొంతం
114 మునస్వమెగ్గో
115 మొగలిపొట్ట
116 చేరింది - తీరమెంది
117 వానచిలుక
118 తాదాత్మ్యము
119 బొమ్మల యోలలింపు
120 బిద్యత

121 అనుభవము
122 అనుసరణము
123 ఆత్మావలోకనము
124 ఈవి
125 కీర్తి
126 అవిరళత
127 ఊహా
128 ప్రజ్ఞ
129 తృప్తి
130 సున్నితము
131 యాచ్న
132 ఆశ
133 పరిశీలన
134 మధురిమ
135 పరిపూర్ణత
136 భయము
137 క్షమార్పణము
138 భగ్నము
139 అమృతపంథ
140 వైరాగ్యము
141 వెన్నెల్లో ఓ రాత్రి మస్లింశసంపాతు
142 దిక్కులేని ఓ మనిషి శవం
143 విలువలేని ప్రేమయీదె ?
144 నిజమైన కూలివాడు
145 ఎరుగవు నన్ను ?
146 చూస్తి సీకంటు
147 నాసపై పిల్ల
148 అనవాలు మెఱుపులు
149 స్వేచ్ఛ చెవొప్పింపు
150 ఆ పువ్వే - ఆ నవ్వే
151 ననకారు
152 త్యాగసుధీ
153 చిలకలచీర
154 ఒంటికొబ్బరిచిగురు
155 చెట్టంత పువ్వు
156 ఆకు ఆకు చాటునుండి
157 రంగేళిరంగ !
158 అనుజ రామరాయ
159 ఆవేదన
160 విదియనాటి చందాయి
161 స్వాతంత్ర్య ముహూర్తము
162 భారత స్వాతంత్ర్య గీతిక
163 అశోకచక్ర గీతిక
164 ఆంధ్రుని వీరగీతిక
165 రాష్ట్రదీక్ష
166 ఎందుచే ! - ఎందుచే !
167 విమలభారత
168 జాతీయ గీతిక
169 వొయ్యారి తెనుగు బాప
170 నేటి కలము - నేటి నాగలి
171 తువ్వా !
172 ఎట్టి కలువ పువ్వా !
173 శీతకాలపు సంధ్య
174 పాటచలువ
175 జీవనగీతిక
176 మేకలార !
177 వెలుగ
178 పసులకాపరి
179 వరదలప్పుడు
180 మాఘమాస మధ్యమందు
181 ఆశయము
182 చిన్ని మేఘమా !

183 అపరిమితానందము
184 మొలక - తరగ
185 ఒక అపరాహ్ణమున
186 ఏమంటివూ నీవు రానంటవా ?
187 సుందరతర శరదిందు
188 వరహాలరాజా !
189 దారిగాదిది
190 బల్లకట్టు
191 సంవత్సరాది
192 రంయి - రంయి
193 రంగంనుంచి
194 కూలియన్నల కుతుకము
195 తొందరపడెదేలా ?
196 అందరికంటెను ముందు
197 సంతనుండి
198 పొలము బయలున
199 ఒక వేసంగి యపరాహ్ణమున
200 గొల్లవాడ ! పిల్లవాడ !
201 ఎక్కడున్నావోతే
202 తీర్థపు సరదా
203 విహారపు తావు
204 రస్తా మరమత్తు
205 కోతపాట
206 చిన్నిగీతికలు
207 పేరులేని చిన్నిపుష్ప
208 ఎఱ్ఱనెఱ్ఱనిసంజ
209 సంకురాత్రి
210 బాతులజంట
211 నదికథ
212 ఒక మనస్థాయి
213 కలమూపు
214 గాలివాన
215 విరిమల్లెపూలు
216 ఓబయ్యా ! - ఓ బయిటి !
217 అంకెయ
218 నీటిబొట్టు
219 పేరు
220 హనుమంతుడు
221 వినాయక
222 మూత్పలాలసము
223 ఆరుబయట
224 ఉడుత - ఉడుత
225 పట్నవాసపు చిలుక
226 రాజు - రయితు
227 ప్రాణికోటి బ్రదుకు సంపద
228 పెద్దనవ్వు
229 శ్రీకృష్ణ
230 సమాప్తి శ్రుతి

# కవికొండల వేంకటరావు గేయాలు

## సంబోధనము

నీపతివ్రతనియతి - నీదుపున్నెపుగాథ
నీప్రేమమయకళన్ - నాప్రాణముల్ నిల్చు
ప్రణయినీ ! ప్రణయినీ !

చూచునీచూపెల్ల - నాచూపులోగలియు
గనులు తన్మయముగా - గనుఱెప్ప లరమూయు
ప్రణయినీ ! ప్రణయినీ !

నీదునర్మాలాప - మేదిశకు దవుచన్న
నాశ్రుతి గుహాంతరసీమ - విశ్రాంతి తుదిగొనెడు
ప్రణయినీ ! ప్రణయినీ !

నీదుచల్లనిచేయి - నాదు తపిత శరీరమున
బెనచినగునంత
తొణకించితనుకొందు - తుహినకరుసుధబిందు
ప్రణయినీ ! ప్రణయినీ !

నీవు చీకటినున్న - భావమున కదియెంత
పరిపాటియైనదో !
లేవు లేవని నెమకి - త్రోవనే పేర్కొందు
ప్రణయినీ ! ప్రణయినీ !

## త్యాగము

నేను చినిగిన ప్రాత - బైని పైచుకచన్న
నిను బనారసుచీర - గొనబుగా గట్టింతు.
మోము ముడుతలువడుచు - నేముదిమిబైకొన్న
నవవయోవిభవ సుం - దరివిగా నిన్నెంతు.
ఉసురెడని నా తనువు - దశతప్పి దశగన్న
నిను జిరంజీవివై - మనగ దీవెన లిడుదు.
ఆశావిపంచి నా - దాభంగమగుచున్న
బలుకరింతునునిన్నె - పలవరింతు,
అమృతంబవునీవ! - నవనవోన్మేష
సంజీవనంబవునీవ! - కాలావకాశ
కళ్యాణ సఖ్యమవీవ! - గండస్థలాభోగ
కంఠహారమరీచి - మణిత మంజుల నినద
మధురగానమవీవ! - ఓచెలీ! ఓచెలీ!

## నైరాశ్యము

నిన్ను దలపోయుచునె నే జిదుముకొనిపోతి
పచ్చికాయలు వట్టిపూవుల్లో రేకుల్లో
ఫలమెంచనైతి లోపలి తేనెగొననైతి

అలసముద్రపుటోర దెలి నురుగు కెరటాలు
ఇసుకలో జిరుబుడగ లెత్తించుటలుగంటి
మునిగి ముత్తెంపుమూట మున్లైమోయగనైతి ...నిన్ను

కొండనెత్తపుజెట్టు కొమ్మపై దిన తిన్న
గనవచ్చు నొకసుక్క కాంతికళ నాసిస్తి
తెట్టతెన్నేపట్టు దివ్వె తెలియగనైతి ...నిన్ను

## గీ త

ఇవియన్ని మనకేల ?
అదిగో ! చూడుడు గీత !

అవకాశపుంలోత
ఈతచెట్టావల
తాటిచెట్టావల
సరుకుచెట్టావల
సద్దులేమినిగీత !

మంటిమింటి నడుమ
మనికిదేల్చెడుగీత !

ఆ గీత తంబుర
తీగసేసినపుడు
సంగీత మనిపించు !

ఆ గీత మనచూపు
లదికి చూచునపుడు
సంగాత మనిపించు !

ఆ గీత మనమనసు
లరసి మఱచునపుడు
సంకేత మనిపించు !

చేలో నీ గొంతెత్త
జివదేఱి వినుపాట
చెలిమి ఆ గీతలో
చెలగించు మఱుమ్రోత !

రేవులో కడవుంచి
బావిలొత్తినపూట
కలిమి ఆ గీతలో
కడకొత్తు నెఱవ్రాత !

పొలిమేరపుడుకేరి
చలిమంట కనుమాట
బలిమి ఆ గీతలో
బమగొల్పు వటువాత!

## శూన్యత

ఈ నిరాడంబర - ప్రేమ మెద బొలుదొల్త
జిత్రించుకొన్నపుడు - చిత్రమెదొ చెప్పనా?
ఓచెలీ! ఓచెలీ! - యేమి యనుకొనవుగా
నీవు లేనేలేవు!

దూరాన నించున్న - నారికేళ శిఖాంత
మావెనుక పొంచున్న - యంబుదపునెదిశాంత
మట్టె చూచుచునుంటి - ఇట్టె యెదొ చెయివచ్చి
కనులు వ్రేళ్ళనుమూసె!

నాచేయి కనుమూయు - చేతిపై వేవైచి
మార్దవం బెంచుచునె - గోళ్ళ నున్నదనంబు
కొనగోళ్ళ రాయుచునె - యల్లనల్లనగుంద్ర
మణికట్ల కంకణాల్ - నడుమ గాజులు మెఱయు
దనుకజర్చ బెనంగి - వివిశాన బేర్కొనులా
వినన్నవు సవ్వసది!

నీవటవేయంటి - నీవయ్యెతివి! ఎంత
చిన్నబుచ్చితినొక్క - విన్నునేనవ్వేళ?
నీవు లేనేలేవు! - నీవు లేనేలేవు!
ఓ చెలి! ఓ చెలీ

# ప్రణయ తత్త్వము

సడియ జప్పుడుగాక - చక్కగా నీకళ్లు
రెప్పలు మూయుచు - విప్పుచునుండంగ
విశ్వమోహనమైన - ప్రేమయెంతో
నిత్య నిశ్శబ్దమయమంచు - ననుకొంచు నేనుండు
ననుకొనుచునుంటూనె - వినుచుందు నీదైన
మణికట్ల కంకణ - క్వణమంజుల స్వనము
అధరాంత మంగుష్ట - తర్జనమ్ములనడుమ
నొంచి యువ్విళ్ళూట - నీవు నించునియుండ
స్వప్న సూక్ష్మంబైన - సుప్రణయ తత్త్వమ్ము
ఆధ్యాత్మికపు శాంతి - పూరితంబేయంచు
దలపోయుచుందు నా - తలపోత జెలియ నీ
ముక్కుపుడుక రవ్వ - గ్రక్కు నునుకాంతులు
మిఱుమిట్లు గొలిపి - సంభ్రమితు జేసెడు నన్ను
ఎద బయ్యెదనుహత్తి - నీవు గుట్టుగదోప
నంతరంగస్నిగ్ధ - ముగ్ధదీప్తిప్రభ
వెలయింతు వనుకొందు - ఆ వెలయించుశోభ నే
దీర్ఘ నిశ్వాసమ్ము
జినుగు చీరచెఱంగు - చెదరించుటలుగందు.

# మబ్బు - గాలి

ఎంత మబ్బట్టినా ఎంతగాలేసినా
నీలనీలాకాశ మామట్టునేయుండు
అప్పటికి నిప్పటికి దోబూచులాడ్తుండు
ముసిలితనమొచ్చినా, ఊసురుస్సురనుచున్న
నడుమొసిలినాకాని, యుసులట్టులేయుండు ...ఎంత

ఈనాటి కెల్లుండి, తేపటికి మఱునాడు
ఆ లెక్క చూచుకో, పండ్లుబూండ్లగుచున్న
ఒకనాటి కొకనాడు అదియెంతచేరికో ...ఎంత

చందమామనుజూడు, అందాలతెలివేగు
చందంబులనుజూడు, ముందుచుక్కనుజూడు
సందేల బిగిచూడు.................. ...ఎంత

## ఉదంతము

నీసొబంగెట్టిదో - నీ సురూపంబెదో
తెలిసికొనకుండనే - ఘనసు కలుసుకుపోయె
రూపురేఖలవివర - మేర్పరింపకమున్న
చేపట్టితిని నీ - సేవకుడనేనైతి.

నల్లనగు కీల్జడను - తెల్లమల్లియ తుఱిమి
వెళ్ళు నీపోకడును - గళ్ళారజూచినే
"ఓ జడా! ఓ మల్లె!" - యని పిల్వనోడితిని.
నడదారి నేజారి - పడుపూలనేరుచును
"హా సఖా! హా ప్రియా! - యనుచు వెన్నంటితిని.

పసుపు పారాణిపై - మెఱసి మొఱసెడునంచె
మేదినీ దేవతకు - మేలుకొల్పు రుతింప
"నదెయందె అదెయంద" మని చెప్పదప్పితిని
బాటనీ యడుగడుగు - వడిజన్న దవుగొల్చి
నినుసఖిగ నిన్నుప్రియగ - నానవాల్పట్టితిని.

దిద్దితీర్చినసొగసు - నొద్దికెంతోకంటి
హత్తియుంచిన చెక్క - టద్దంబు మదిహత్తి
సుద్దులెన్నోవింటి - నొకదాని నిట్టిదని
యూహగొనలేదప్పుడు - విరహాశ్రుమౌక్తికం
బెఱుకదారమునెత్తి - రచియించితిని—అంతె
నాప్రియా! నాసఖీ!

## మర్మము

నీవు చీకటి పిల్లవా? - చెలీ! ఓచెలీ!
నీవు వెల్తురు పిల్లవా ? - చెలీ! ఓచెలీ!
నేను రెండునుగాను - నేత్రదోషపుదాన
నీరెండనెమ్మోము - పై రమ్యముగత్రాల
సన్ననౌ దువ్వలువ - సరిగంచుచీరాడ
పచ్చతో మినబిందె - పట్టుకొని నేబోదు
బ్రక్కగలయానందె - దేవళముులోనున్న
బావినీరమునకై.
నీవు క్రమ్మఅవచ్చు - నపుడౌ పోనీచెప్పు !
చుక్కచీకటిలోన? - శుద్ధశుభ్రజ్యోత్స్న ?
ఎటువచ్చిననునేమి? - కడవనీరముదొణకు
నినుగన్న సందడినె - కాలిమట్టియతనకు
దానైయెరుతిదలకు - నినుబోల్చ వెంబడినె
ఓ పాంథ ! పరతంత్ర !

## ఉత్కంఠ

తేలిపోవుటె యాస దరిదేలుటేరాస
తేలింపు నొకరొకరు తెలిసికొనుటేబాస
తెప్పగా ననుజేసి నడిపించినావరే
తెప్ప నీవై నన్ను నడుపుమన్నావరే
రంగ దుత్తుంగ తరంగ మోహనపంక్తి
రంగవల్లిక దిద్దుచున్న ప్రాంగణభూమి ...తేలి
సంపూర్ణచంద్రికా సార కూలంకష
స్థిమిత శారదమేఘ చిత్రవర్ణములతో ...తేలి
అప్రయత్న ప్రాప్త యౌవనోద్ధూత పరి
చేలాంచల స్నిగ్ధ చైతన్య దీధితుల ...తేలి

## వెళ్ళిపో నీదారి

నిన్నూగాదోపిల్ల! నిన్నానుకొంటేవొ
వెళ్ళా వెళ్ళుముపిల్ల! వెళ్ళిపో నీదారి
పొద్దుకుంకెట్టా నీ ముద్దూమోముదేల
అద్దీర! ఆమోమె ఆమోమె యనుకొంటి ...నిన్నూ
చిఱుచాలి సంజానీ చీరంచు చనుగప్ప
ఆ-సిగ్గులేమొయంచు సనుకొంటి గనుగొంటి ...నిన్నూ
అసర సందెలనీదు నందేలు రవళింప
ఆ-ఒంటి అంజల అందెలంచూను వినుకొంటి ...నిన్నూ
మునిమాపు పడులో నీముడిదారి పూముడువ
ఆ-దూమూడిముడుపొక్కొ అనుకొంటిపసుకొంటి...నిన్నూ
ఇరుల మూతలనన్ను నెవరోయని నీవెంచ
ఆ-ఎవరు నీవాయంచు నరసీతి నీవైతొ ...నిన్నూ

## లెగవేమే? నగవేమే?

సుక్కలో సుక్కొడిచి మొక్కమామిడినిలిచె
లేడిచూపులపిల్ల లెగవేమే?
జేడిగాలాకళ్ళ నగవేమే?
చందమామీదాక సందె వెన్నెలథాక
చూపించి చూపించి సొమ్మసిల్లాదెట్టి
చిమ్మచీకటిచింత చెట్టంకా
చిన్నికాటుకరేక నావొంకా ...సుక్క
పైరుగాలికి పూలవోసనలు వనమెల్ల
వలపించి వలపించి నిలిసి పోనాయుల్లె
హద్దుసద్దులులేని యాకసములో
ముదులా కనుఱెప్ప ముఱుసుకొనులో ...సుక్క

పరవతాలను మ్రోత పక్షికూసినకూత
ఉండుండి వినిపించి యూరకొన్నదియిట్టె
తలపులో నెదొ క్రొత్త తలపు నిలుప
మలపులో కనుపాప నలుపుగలుప ...సుక్క

## పీ ఠి క

హృదయ ముద్వేగియై - మధుర గీతికలెత్తు
మదిరాక్షి! మొగమాట పడకుమా! పడకుమా!
వీణమెట్టెక్కించు - వెలదిరో! వెలదిరో!
తాళమానముగొల్పి - తరుణి! ధన్యతబాడు!
జీవితం బీపూట - భావపూరితమౌచు
దావిచ్చుచున్నయది - దరిలేని సుఖమునకు!
కావలసినది యింక - కలికి! యేమియులేదు
నీవీణ నీగొంతు - నీయెత్తుగడ అంతె!

## పోనీ లే!

పోనీలే - పోనీలే - పోనీలే - యేగాణి - కేమిలే - ఏమీలే
ఎందూలో వచ్చినా - వచ్చిందే ఆలాభం
పోనీలే - పోనీలే - పోనీలే - యేగాణి - కేమీలే - ఏమీలే
సందూలో కాపురము - చక్కంది ఆ పడుచు
పోనీలే - పోనీలే - పోనీలే - యేగాణి - కేమిలే - ఏమీలే
రాకరా కొచ్చింది - రాగులిమ్మంటోంది
పోనీలే - పోనీలే - పోనీలే - యేగాణి - కేమిలే - ఏమీలే
కొంపటోరి సిన్నోడ! - కొలు అంటు సూస్తోంది
పోనీలే - పోనీలే - పోనీలే - యేగాణి - కేమిలే - ఏమిలే
కానియ్యి మంటోది - ముక్కాని యిస్తోంది
పోనీలే - పోనీలే - పోనీలే - యేగాణి - కేమిలే - ఏమిలే.

## నా బావ

చక్కిలా లొండానురా - చక్కన్ని నా బావ!
యొక్కటే యుంచానురా!

వక్కాకు నివుతెస్తె - సుక్కకూరే సేస్తె
అక్కఅకు వస్తుందిరా - చక్కన్ని నా బావ!
అటకపై పెట్టానురా! ...చక్క

నిశిరేత్రి నివువస్తె - డిశతిరుగ నేసూస్తె
మక్కువలు నిలిపించురా - మా మంచి నాబావ!
మనసోయి దాచానురా! ...చక్క

ఓసి అని నివుపిలిస్తె - ఆస నేగెడతిస్తె
వూసాడ మఱపించురా - వొయ్యారి నా బావ!
వోసనలు మురిపించురా! ...చక్క

వుస్తె నీ కగపిస్తె - నాకు పో నని పిస్తె
కమ్మనగు కఱకఱలురా - కావలసి నా బావ!
జిమ్మపై గరగరలురా! ...చక్క

## రానిదాన్ని

చీకటిలోన వాన చినుకు చిట్ పట్!
ఆకుచాటు ఆడపిల్ల చట్ పట్!
పూల్ పూచె బొడ్డుమల్లె గప్ చప్!
కోతకొచ్చె గొడ్డుమావి చక్ చక్!
వేళకాని వేళవచ్చు ఠర్ బుర్!
మేలమాడి నవ్విస్తాడు బల్ బల్!
కోడెకాడు కొంటెవాడు అంయి అంయి!
రానిదాన్ని రమ్మంటాడు సంయి సంయి!

## సిగ్గు - ఎగ్గు

నీ ముక్కు మొగము నెఱుగ
నీ యూరు పేరు దెలియ
ముగుద నీకు సిగ్గేం ?
ఇంతి నీకు ఎగ్గేం ?

ఇటు నటు నెటొ చూతు - నా వంక చూపుదాతు
అది యెట్టి వింత చెప్పు ? - అది యేమి వెడగు దెప్పు ?

నీ ముక్కు మొగము నెఱుగ
నీ యూరు పేరు దెలియ
ముగుద నీకు సిగ్గేం ?
ఇంతి నీకు ఎగ్గేం ?

అంజ వడిగ వైతు - వడిగ వైచు నంజ
పాంజేబు ఘల్లు మ్రోతు - ఆ ఘల్లు నేను వినులో
నొత్తిగిల్లుచుందు
అది యెట్టి తప్పు చెప్పు ! - అది యేమి యొప్పుల కుప్ప !

నీ ముక్కు మొగము నెఱుగ
నీ యూరు పేరు దెలియ
ముగుద నీకు సిగ్గేం ?
ఇంతి నీకు ఎగ్గేం ?

గాలికింత పయుట - వీల తొలగి చనగ
నేనేమొ చేసినట్టె - నావల్ల నేరమనగ
ఇట్టె సర్దుకొందు - వెనుపట్టెతి గాచుకొందు
అది యెట్టి మెలపు చెప్పు ! - అది యేమి వలపు నిలుప ?

నీ ముక్కు మొగము నెఱుగ
నీ యూరు పేరు దెలియ
ముగుద నీకు సిగ్గేం ?
ఇంతి నీకు ఎగ్గేం ?

పట్టపగలు వేళ - బట్టబయలు దారి
నిన్నెత్తుక పోదునన్న - నెలవు వెరవుగాన
అలవు జలముబూన - అయిన నీదు మేన
బసిడి చెమట ప్రాణు - మడలినట్టుక్రమ్మ
అది యెట్టి గురుతు చెప్పు? - ఎదమఱతు నెడప దడప!

## చూపు

ఏవైపు నీ చూపు? ఎందాక నీ తూపు
ఏమిలే నవకాశ మందేమి నీ ప్రాపు?

వొట్టి తట్టను చేత వొదు లొడుతె జారేసి
అట్టె యేమిటొ ధాతకంటె నెక్కుడు దలతు.

తలప నే మున్నాది లత కూన చిగురాకు
చూడ నే మున్నాది జోడెడ్ల బండాకు
జోడెడ్ల కళ్ళల్లో చిగురాను సిందాడ
మది దోచునది యేమొ మాపటికి కూరాకు?

కూరాకువండి అ - కూటిపైపెట్టి నీ - కోసమై కూకుంటె
తోచక తోచేటి రాచ పడుచు సోకు.

## పైరుగాలి

వెయ్యి! వెయ్యి! పైరుగాలి! - హాయి! హాయి! పైరుగాలి!
ప్రాణం లేచొస్తోంది పైరుగాలీ!

పయ్యెదలో గబ్బి గుబ్బల్ - ముచ్చెంవట్ల నుక్కిరి బిక్కిర్
అయ్యాయి యీదాక - అటచ్చు పుట్టిమునగ ...వెయ్యి

మొయ్యి! మొయ్యి! పైరుగాలి! - జాయి! జాయి! పైరుగాలి!
ఎక్కడున్నా మల్లే మొల్లా - యిక్కొప్పులొకేదొర్ల ...వెయ్యి

తియ్యి! తియ్యి! పైరుగాలి! - ఉయ్యాలా పైకితియ్యి!
వెయ్యాలా పందెం ఓడా - కొయ్యాతో సంద్రంమేడ ...వెయ్యి

## పొట్రేలు

పొగరెక్కి పొట్టేలు - పొడిచేయు నోపిల్ల!
తొగరు చీర పిల్ల! త్రోవలో లెగు లెగు!

పచ్చగట్టేమేసి - వక్రించినది కొమ్ము
మచ్చిక దనుకోకు మార్గాన లెగు లెగు!

బొచ్చులో చిరుగంట - బురణించి రవణించు
ముందంజ వేయకు - పుంతలో లెగు లెగు!

కచ్చపోసినపిల్ల! కాలందె ఘలుపిల్ల!
వచ్చుచున్నదిపిల్ల! వయ్యారి ఓ పిల్ల!

పొగరెక్కి పొట్టేలు - పొడిచేయు నోపిల్ల!
తొగరు చీర పిల్ల! త్రోవలో లెగు లెగు!

## జ్యోతి

పదునాల్గు భువనాలు - పరిసుప్తి నుండంగ
మనము మేల్కొనియుంట - మఱచిపోతె?

నీ కంటి కొలికి నొక - నీటి బిందువు నిల్చి
ఖేదమో మోదమో - భేదపఱుప
రాని నిశ్చలశోభ - మాననీయంబయ్యె
తక్కుగలవారి - కంధంపురాత్రి

మనపట్టు మాత్రమపు - డనుకొని పట్టపగ
లనిపించె దాని నీ - కపుడె తెలుప
నాత్మనెంచితి - గాని యశ్రుకణము
ముందు దుడిచి - వెనుక ముచ్చటింపగబోతి
నీవు మందస్మితస్విన్నవైతి - కనులు మెఱసెను!
కప్పె గాఢాంధకార మెద! - ఓ సుముఖి! ఓ సఖీ!

## అబ్బా !

అబ్బా! దీనబ్బా ముండామోసిన చలిగాలి !
నా గూబల్లోకికొట్టును - దాని గుబ్బల నేంచెయదు
నా పక్కలొంచివేయును - దాని ఱెక్కల తుంచెయదు
నా పళ్ళూ జిల్లనిపించును - దాని పెదవి సళ్ళివదు
నా వళ్ళూ వణికించేయును - దాని గుండె కదలెయదు.

## ఎక్కడికి ?

ఎక్కడికి పోతున్నావు ? చక్కనిపిల్లా !
ఏ పక్కాకు సూస్తున్నావు ? చుక్కలాగల్లా !
కోత కొడవలిలేదు జీతానికనివచ్చే మాతంగి తట్టాకా
దాతలను పువ్వెట్టి చేతిలో బువ్వట్టి—ఎక్కడికి ?
సత్తుగిన్నె పెఱుగు దుత్తలో వొరిగేను
చిత్తజూని పఱుగు కొత్తిల్లేని చెఱుగు—ఎక్కడికి ?

## పోలేరమ్మ

పూల రైక తొడిగింది - పోలేరమ్మ !
పుంజు చంక నెట్టింది - పోలేరమ్మ !
సంతలోన కొన్నావా ? - చక్కని పుంజు !
ఎంతకేంటె కొనుగో - వెంచక్కటి రంజు !
అడిగినావులే మాంవ ! - అలసికొద్ది మొగుడు
తొడిగినావులే నువ్వు - తొగరు వన్నె చొక్కా !
తొడిగికొన్న యిన్నాళ్ళకు - అడిగినావే పిల్లా !
అడిగినంతసేపైనా - అగినావుకావేం ?
జువ్వినీడ యెఱసింది - దాని జుంక వంక
ముువ్వటాకు మోతట్టె - దాని తలపు ఢంకా !

## సామరస్యము

మన మొంటరిగనుండు - ననుకూల సమయాల
నరమోడ్పు గనుదోయి - నరమర లేకుండె!
రాజబాటను బ్రజ - జూచుటలో నింత
పుయిలోట యదియేల? - దయిత! నీకీ నాట?
ప్రజ లెఱుంగరె మనల - భావ సందర్భంబు
గుజ గుజలు వోవు వా - రజరా మరులుగూడ!
కన్నెత్తి కనుగొనుము - కలికి! నాలో సన్న
చిరునవ్వు దులకించి
సరభసపు నడకింక - చల్ల-చల్ల-సాగనీ!
వెల్లడియ యని తలప - కొరు లెందఱో దారి
నోర చూడ్కులు చూడ
నీ వొత్తిగిలి చనుట - నీతియే? ప్రీతియే?

## రంగు - చెంగు

రంగంటే రంగేకాదు - చెంగంటే చెంగేకాదు
రంగద్దినట్టి చెంగు - రాచుకొన్నాది
తొంగుంటే సందెలిడత - తోచకున్నాది ...రంగంటే
నిదరోదామంటే దాని - యుదుటు చూపులు గుదులు
గుదులుగా నాదుకంట - మెదలుతున్నాయి
వొదిలించు కొందామంటె - వొదలకున్నాయి ...రంగంటే
పదంవాడుకుంటు బుద్ధి - సెదరింతామంటె - అబ్బ!
పదంవెల్ల దానిపల్కె - పలుకుతుంటాది
కథముందు దానికుల్కు - లెదురుకుంటాయి...రంగంటే
మొన్నవచ్చినవేళ - నిన్నవచ్చినదాలా
నిన్నంటే నిన్నేకాదు - మొన్నంటే మొన్నేకాదు
పున్నమి పుచ్చపూల - వెన్నెల గాయురేల ...రంగంటే

## విస్మృతి

ఎపుడు వచ్చితివన్న - నిప్పుడే యని యందు
వెప్పు డడిగినగాని - యిపుడె యందు.

అగును! చిత్ర మయది
అదివఱదాక నీ - రానంతసేపు నా
మానసమున నిముస - మొక యుగమెమమ్మ —
ఓడుదు నీ రాక - యుగమసంగ—

బిట్టు నిట్టూర్పు నీ - కట్టెదుట రాదుగా!
నినుజూచు నుబలాట - మనుకొనని యట్టులే
మాయమైపోవు నా - మాత్రముగ నీదైన
జాడ యగపడు లోన - సకియరో! సకియరో!

అందాక దలపోత - నాడుకొన్నపి యెల్ల
నినుగూర్చి కానట్టె - వినిపంచ వొకట్టైన
స్పర్శ సుఖ మిడుమింక - హర్షమున మఱతుగా
కిపుడె యని యిపుడె యని - యే నన్న దటకూడ.

## ఒత్తిగిల్తే

మామంత మంచోడు మఱి దొరకబోడు
మామంత సెడ్డోడు మహా బుట్టబోడు
నా బూరి బుగ్గలో బూరిలా గుంటాడు
నా పూరి గుడిసెలో ముల్లులా గౌతాడు
నా కన్ను తెలిసైగ రంగులేస్తాడు
నా సల్లసిగ జూచి తెల్లబోతాడు
కనబడక పోతినా కడలి కాస్తాడు
కనబడితినా వీథి గర్వపోతాడు
తన నీడ నాపక్క తల్లి దాపుతాడు
ఒత్తిగిల్తే ప్రాణ మొత్తుకుంటాడు.

## కళ

భవదీయ పరిణామ - బహుళ బాహిరరేఖ
జిగి నగిషి పని నాదు - జినుగుటూహ

నీ దృగంచల మంథ - నీల నీరద చపల
బీర దాని దలంచి - యొయ్యార మందుంచి
కను గొలంకుననుండి - కడకంటివఱకు సు
భ్రూ విలాసమువెంట - బోషింతు బోషింతు

నీ మనోల్లాసంబు - నిఖిలావనీ వలయ
వేష్టితాంబోధిపై - వెన్నెల రుచి
అది పెదవి తుట్టతుద - గొదమ నవ్వున గొంచి
లేత చెక్కిలినించి - యే తట్టు మెఱయింతు

నీ పరిభ్రమణంబు - నిత్య సత్యాకాశ
దిఙ్మండలాశాంత - దినమణిప్రభ
ఎదగొన్న యుదుటులో - చిద్రుపలగు చిత్ర
పరమాణు రజము - నే పథినురల్తు

భవదీయ పరిణామ - బహుళ బాహిరరేఖ
జిగి నగిషి పని నాదు - జినుగుటూహ

## మి ఠా రి

మీటేను మిఠారి మిఠాయి చందోయి
మీటంటే నే పాట పాడిందిరా—

కళ్ళల్లో నవ్వెల్ల గుళ్ళల్లో కొచ్చింది
గుళ్ళపేరులో మల్లె చెండల్లె దొరికింది ... మీటేను

పక్కల్ల నవ్వెల్ల పయటంచు కెక్కింది
అంచు తొగరంతాను అనురసంబైంది ... మీటేను

కడుపు చెక్కలై నవ్వు కౌగిట్లొ వొలికింది
కౌగింటిలో మనసు కౌదీగ మెఱసింది ... మీటేను

## ఓ నా డుం

దేహంలో వోనాడు మోహంగా నుంటాది
ఆహార మానాడు ఆ పోదు కూసింత
ఆహాన్ని మేహాన్ని తిరిగిపోతది మనసు
ఊహ కూడా వెనక పడ్డట్టు లౌతాది
గట్టుమీదావున్న చెట్టూరికే వొతుగు
పుట్టలో నా కోడె నాగన్న మెలితిరుగు
అట్టోసి నాపెనం పొయిమీదనే జరుగు
గుట్టుగావున్న నా గూడెల్ల జగమెరుగు.

## చెలో భాయీ!

నావకు రంగులు వేశాను - సంగతి బావకు చెప్పాను
రంగులమీద చెంగడేసి - చెలోభాయీ అన్నాను—
ముంగురు లెనక్కు వొత్తాను - సంగతి బావకు చెప్పాను
తొంగలి ఱెప్పల తుపానురేపి - చెలోభాయీ అన్నాను—
లంగరు చప్పుడు చేశాను - సంగతి బావకు చెప్పాను
భంగలకోస్తా నుంగరముంచి - చెలో భాయీ అన్నాను—

## పేమ

సింతసిగురు సొగసుతెల్సు - సింతకాయ పులుసుతెల్సు
సింతకెక్కి సిగురుకోసే - సొగసుకత్తె చూపేతెల్దు—
తాటిముంజె తరుణంతెల్సు - తాటికాయ వాటంతెల్సు
తోటకొచ్చి తొంగిచూచే - గోటుగుంట సీటేతెల్దు—
పైరుగాలి తేరుతెల్సు - మావిపండు మధురంతెల్సు
తేరుడిగుచు తెరువులు వెదకే-ఆ యొయ్యారి ఆకలెతెల్దు—
సింతకొక్క నిచ్చెనేసి - తోటకొక్క కంచెగట్టి
మాటుమణిగే దాకాకాస్తే-గాటముగ పేమింపకపోద్దా?—

## వా వి దా ?

వావిదా యీ పట్టుతేనె ? - మోవిదా యీ పువ్వుతేనె ?
ఎంత తియ్యంగుంది పిల్లా ! - బావకానా అనీ పిలవ
ఎంత మధురంగుంది పిల్లా !
వయసుదా యీ పరీమళము ? - వన్నెదా యీ గుబాళింపు ?
ఎంత దివ్యంగుంది పిల్లా ! - అంత దూరాన్నుంచె వోహొా!
ఎంత రమ్యంగుంది పిల్లా !
గాజుదా యీక్వణక్వణం?-మోజుదా యీఝుణంఝుణం?
ఎంత బింకంగుంది పిల్లా ! - ప్రేమ సుంకం పెచ్చుపెరిగి
ఎంత పొంకంగుంది పిల్లా !

## కో కి ల వం గ డు

తురాయి పువ్వు తుఱిమితి కొప్పులో
సరాగమాడిన సరసుం డెవడే ?
తురాయి పువ్వు త్రోవలో దొఱికెను
సరాగమాడెను చల్లని గాలి—

శిరీష కుసుమము చెఱివితి చెవిలో
పరాసికాలకు బావ యెవండే ?
శిరీష కుసుమంబా చేరువదే
పరాసికాలకు బావ యతండే—

కదంబపుష్ప పరాగంబేమే ?
నితంబమొత్తిన నీ విటు డెవడే ?
కదంబపుష్పము కాలువగట్టుది
నితంబమొత్తెను నే గూర్చుంటే—

పదారుకళ లంటిన మొగమేమే ?
చకోరి కనులకు చంద్రుం డెవడే ?
రదారి పడవను రంగుల గదిలో
మొగానబోసిన పున్నమి మంచో—

మిఠాయి మామిడి తియ్యములేమే ?
బహూకరించిన నీ మగ డెవడే ?
మకాంకాడ మామయతోట
కోహూ కుహూ మనె కోకిల మగడు—

## బంతిపూలు

అరటి పిలకలు క్రొత్త నాటిన - పరుసలన్ నీరుల్లి యూడ్పె
పణతి కొప్పులో - బంతిపూ లున్నయి!
ఓ రబ్బో! - ముద్దపూ లున్నయి!
బందలో వొంగూని యూడ్చే - సంపడినివడి
జారిపడిపోనయి!
ఇస్సీ! - వీడిపడిపోనయి!
అస్సీ! - ఊడిపడిపోనయి!
ఇట్టె అవి తీసుకొని మళ్ళీ - అట్టె బాడీ చేతులాతో
ముట్టి ముట్టనితీరు రహమై
కొప్పులో పెట్టుకొని మెఱసె - ఊద్పుకత్తనుకోనిదేమెఱసె!
ఊద్పుకత్తిక ఊడ్చెదేంటి? - కూలిపడుచిక గ్రుచ్చెదేంటి?
సంకురాతిరి పొద్దు - చలిబ్రావాలె! ఊహూ!
సన్నసన్నగ పొద్దు - ఎఱ్ఱవాలె! ఓహో!
భోగిరేపని డబ్బులడిగింది-కాలుదులుపుల గట్టునెక్కింది
పెద్దపండగపేరు సెప్పింది - పద్దురూ అని విసుగుచూపింది
పొద్దు కూకులో చేయిసాచింది
అద్దిరా! - అది కంటికూకులో కలికమైయుండి
ఉల్లి పూసేదేంటి యింక? - ఉల్లి యూరేదేంటి యింక?
మల్లెతీగలు పాకపైకెక్కె - మల్లెపువ్వులురాలి మైజొక్కె!

## కారెంపాట

కమ్మనీ పాటలకు - కాటుకా చూపులకు
కారెంపు గుల్లపై - కాలణచ లేకుంటి— ఓ పిల్ల!

కమ్మనీ పాటలూ - కమ్మ నా సామివి
కాటుక చూపులు - కడచెఱుకు తోటలవి
ఆకుమళ్ళూ తడవ - అణచిపెట్టర కాలు— ఓ బావ!

తడబడూ గడనడకు - ఎడబడూ పయ్యెటకు
కారెంపు గోతిలో - నీరెత్త లేకుంటి— ఓ పిల్ల!

తడబడూ గడనడలు - వడగొన్న దూడలవి
ఎడబడూ పయ్యెటలు - ఈవేయుగోపడివి
బోదెపార్లెత్తంగ - ముంచెత్తరా నీరు— ఓ బావ!

కుతికంటు తీగకూ - కొలుకుమొఱ గాజులకు
తలబరువు కారెంబు - నిలుపంగ లేకుంటి— ఓ పిల్ల!

కుతికంటు తీగలు - గుత్తకొలగించలవి
కులుకుమొఱ గాజులు - కూలినాల్దబ్బులివి
పాఱచెక్కడ్డేసి - పాదింప రావంతు— ఓ బావ!

చెవిపచ్చ పువ్వులకు - చింతపువు చీరలకు
సందేల కారెంబు - సాగింప లేకుంటి— ఓ పిల్ల!

చెవిపచ్చ పువ్వులూ - పచ్చగన్నేరువి
చింతపువు చీరలు - సంతగొను వారలవి ము
దూరూడ్పు సెడకుండ-మోకరించిరముందు-ఓ బావ!

అందుబడి నవ్వులకు - అంతంత బువ్వలకు
ఈ వేళ కారెంబు - ఆడింపలేకుంటి— ఓ పిల్ల!

అందుబడి నవ్వులూ - పైనాడు పడుచులివి
ఎంతెంత బువ్వలూ - ఆడించు బావలవి
భారీగ పండంగ - కారె మాడింపరా— ఓ బావ!

## సంబరగాడు

తలుపు తట్టినవోడె తలపు తట్టినవాడు
పిలుచు కెల్లినవోడె పలుకు నేర్పినవాడు
చూశార? నానాథు చూశారటర్రా?

వీథిలో వింతగా వెట్టోలికి పోతాడు
మేడపై కెక్కిస్తె మిన్నంక సూస్తాడు
వాడె నా నేస్తుండు! ఎడ కనబట్ట!

జిమ్మతో నెమ్మదిగ చీకట్లు పూత్తాడు
చీకట్లు జ్యోతిగా చీర తగలేస్తాడు
నా సంబరగాడు! నవ్వేరు గనక!

## తోయదస్వామి ప్రభు!

మండు నెండాకాల మొకపాటరాలేదు
వానకాలమ! నీవు పాడింతువా నన్ను?
ఇగురుచుకుపోయింది ఏనాటి నాగొంతు
ఎగసెగసి పయికుబికి యేర్పడ్డతలపులే
చిగురు మాడినమాడ్కి శిథిలమై పోయినవి
సొగసు పలుకొక్కటియు ఉబ్బలేదే వెలికి
అరసి యరసీ యాస ననుకొన్న చూపులే
పలక తుడిచేసి నటు వర్ణశూన్యములయ్యె
కలపోల్కినైన మఱి కనిపించినవి కావు
వమ్ముదుమ్మైనవవి చిమ్మ చీకటిమాయ
మై చన్నవవియెల్ల ఆర్తవపు వానతో
యిగిరించి మొలయించి యెప్పటి బలె నాకు
దోపించవోయి వేగ తోయదస్వామి ప్రభు!

## లీల

ఒక్కొకప్పుడు నీవ - యుండినపాళాన
నేదొ చిన్నప్పటి - యెప్పటాటొ ?
గొల్లకంబాలాటొ ? - కొంటె డాగురుమూతో ?
ఏదో ఏదో - వట్టియిసువుపోల్కి
నాడుచుండెదవు

నేనరయునంత - యువతీవిలాసాన
మివుల సిగ్గునుగొందు
ఈవు శిశువువొ ? - యింక నెఱుగనిదానవో ?
యెఱిగియుండియు - నట్లయింపుగొందొ ?

అని యూహ గొనులోన - నతిసమంచితవృత్తి
నోరచూడ్కులుసూతు - దూరమగుచు
అది సమస్తము మఱచి - యతి వినూతనశోభ
నాత్మలో దలపోతు - నాసగొందు.

## సూక్ష్మము

పూర్తిగా నీవు క - న్మూత నిద్దురవోవ
ముద్దిడనుండ దొండొరు సుఖమ్ము.

నీవు నిద్దురలేచి - నిండు మేల్కొనియున్న
ముట్టనీయవు లేనిపోని సిగ్గు.

అరకంట నన్ను నేమఱచి
నీవున్నపుడు యున్నపుడ - నాదైన తిన్నచెయ్వు !

ఆ సుముఖావ్యాప్తి - యా నిముస మెపుడొయని
వేచియుంటిని నిన్ను జూచుచుంటి
యాచించుచుంటి నే గాచియుంటి.

జిగి పెదవి తుట్టతుద - సొగసు చెక్కిలి మోయ
ద్రవగొందు ! వెంట నిద్రను నటింతు
వంతలోపునగదా యాత్మీయపుం భావ
మా ఘడియ ఘడియన్న రెగయంత ప్రేమ.

# సత్కృతి

ఈ గంట లీ ఘడియ - లిసుక గడియారాన
నెఱుగునట్టివిగావు - గఱకపోచ నెండలో నిలబెట్టి
యింతంత నీడని గీయునట్టివిగావు.
వాయువశత గ్రొత్తనీటను - నెండనెత్తిన తెరవాప
నీడ కరళ్ళతో గూడ ముట్టు
వెంబడింపులు సుమ్మ! వెలదికాన!
చీర! - చీర చెఱగు!
చెఱగుటం! - చాయంచు!
అలివేణి కిక క్రింద నగపడుచునె
యాటలాడుట - గాలి తూలింపులను
లేత వాతావరణమందు - బ్రచుఱమగుట
యోహెూ! సుందర మొహెూ!
ఘూళంటునట్లుండి తొలగుచుండు.
వెనుగొందునా నిన్ను? - వినయాన నిన్ను
నిందుండి పొమ్మందునా? - యున్నచోట?

# బాష్పములు

కనుజూపు లన్నియును - కఱగి పోతున్నాయి!
తొణకుచున్నవి నాళ్ళు - తోచదొకటి.

నీకోసమనికాదు - నీ వెదుట నున్నావు
ఏ కొఱంత యటన్న - నేమిలేదు.

నక్షత్ర పథమెల్ల నవశిశిర హిమమొాడ్చి
పులుగడుగు ముతియాల పొలుపు చూపుతువుంటె.

కొండపై తంగేడు కొలనిలో చెంగల్వ
చలిగాలి పడిలేచి సాక్షాత్కరిస్తూంటే.

అంతరాళంబందు నతి రహస్యస్థాయి
నమకోని గతియెదో యనుకొన్న గతికంటె.

## సాయి లాయి - బాయి లాయి

సాయిలాయి - బాయిలాయి - చక్కన్నిమాంవా!
చందాయి - చందన్హాయి - చొక్కించుమాంవా!

ఒక్కడవు నీవుంటె - ఎక్కడుందిచేను?
పొకాకు జతకంటె - రోకైందిలేదు ...సాయి

ఊరకయ నీవుంటె - నేరకయపోను
వారణాసి పురంకంటె - పూరోత్రంలేదు ...సాయి

కొండంత ముస్తాబు! - కొప్పెంతగాను?
అద్దమా రేనికంటె - మద్దిళ్ళులేవు ...సాయి
సెప్పుకో లేకుంటె - ఎప్పటికిరాను?
నిప్పుసెగ పప్పుకంటె - అప్పన లొసాను ...సాయి

దుప్పటంలొ దాక్కుంటె - దూటెంచబోను
బొక్కసపు రూక్కంటె - నక్కబావలేడు...సాయి

చక్కలింత నీవెడితె - పొక్కలికిగూను
చెక్కడపు బనికంటె - నక్కింపులేదు ...సాయి

దిక్కుల్లి మొగవైతె - దృక్కులేంచేయను?
మొక్కింపు మోతకంటె - చిక్కింపులేదు ...సాయి

## ఒకనాటి యూహ

ఊడదిగిన మఱ్ఱికాడ - నుత్తబిందె లున్నవెన్నొ
ఇత్తడితళుకు కెచ్చియుండి - చిత్తములను జేరదీసె
పక్కజీడి మావితోట - పక్కమంచి నీళ్ళనూయి.

ఊడదిగిన మఱ్ఱికాడ - నున్నదొక్క యుత్తబండి
విప్పివేసినట్టికాంతి - చొప్పరాలి యొప్పియుండె
పక్కమెత్త యిసుకదారి - పక్కపోతీ మేరపుంత.

బిందెలలో నీరుతోడి - బండియెడ్ల కట్టుకోని
మండువేసగందునీళ్ళు - ఉండనట్టి యూరిలోన
సత్రమేసి చల్లనీట - దాహమార్ప దలచె నెడద.

## కిట్టము

కన్నె తాడల తోక కమరిచి
కాళ్ళబందం మెడక బోసి
ఆవుకాదని యమున నురవుల
నేపులరసేడు—నా చిన్న కిట్టము
చేపులరసేడు.

మోవి నొకతెను ముద్దుగొంటూ
మురళి నొకతె మొహాట పెడుతూ
పదియారువేల గోపికలలో
త్రోవలరసేడు—నా బాల కొంటె కిట్టము
కోవలరసేడు.

తమ్మి మొగ్గను పగలు విడువని
కలవ మొగ్గకు రాత్రి విడువని
సంజవేళ సమస్త ప్రకృతిని
వన్నెలరసేడు—నా మిసమి కిట్టము
మిన్నులరసేడు.

ఉత్తికంటికి కాటుకంటూ
కాటుకంటికి చీకటంటూ
నీలమేఘ చ్ఛాయచేతన
ప్రేమలరసేడు—నా రౌతు కిట్టము
రాఘలరసేడు.

## సమస్య

నీయఖాత నితాంత - నేత్రద్వయపు శోభ
నైక్యమౌదునటన్న - గా నీయపుగ చెలీ!
కనుపాప నామూర్తి - బింబంబు వేర్వేఱ
కాటు కార్చినకంటి - ననుటెప్ప నేబార్చి

యేర్పఱంతువు వింత
ఎడలేని కలయిక - లేనె లేదా మనకు ?
కనుమూతలోడాగి - కనుపించవా చెలీ !

ఎడ నెడదరుశాఖ - కదలేని యాకాశ
మెసగింతువా దృష్టి - పథమునే నీరాక
నలయ నన్వ్యాప్తి - యెందొ ? యెన్నడొ ! నేర
సుఖ సుఖ స్మృతిదట్టు - నదియె ? ఔనా ? చెలీ !

నీయనూ నానూహ్య - నీల నీలాపాంగ
పారమెంతునటన్న - ద్రోపాడుదుగ క్రొత్త
నాపాదమస్తకం - బగపించు సిగ్గుతో
జలధి తరంగమీ - వలనికే యనుపోల్కి
దాట నెయ్యది తరణి ? - దాటింపవా తరుణి ?
దాటించుచున్న నీ
నీటులో నద్దాని - బాటింపనా ? యొహెూ !

## చెంబేలీ !

చెంబేలీ చిన్ని మొగ్గ - చుక్క వైపు చక్కనిల్చి
రాతిరెల్ల ఒంటరిగా - బ్రహ్మచారి ప్రతిభతోడ
నీవు నీకె పరిమళించి - తెల్లవాఱు సరికి విడిచితే !
తెల్లవాఱగట్ల మంచు-దోయిలించి తొణక నీయవే !
పొద్దుపొడుపు ముద్దులకును-మోము నెత్తి గోమునూపుదే !
ఏతాదృశ కోరకములు - చెంబెలీ లతకూనా !
రాత్రి రాత్రి మూడు రాత్రులు-చూచితి ! నీ సుమత్రయము
చూచిచూచి కోయనైతిని !-హృదయమందు మనిషికి
గల కోపభరం బెల్లబాపు - శాంతి కుసుమ రాజములే !
వాడియైన కొసగోళ్ళు - జంకిపోయె వాని జూడగన్-

## ఉయ్యాలెవరు వేసిరో?

ఎండపొడలు చెట్లనీడ - లీవర కట్టిట్టులై
చండతరపు సూర్యరశ్మి - చక్క చదరవేయుచో
నిండు వయసు మర్రికొమ్మ - నిత్తెమూచు నూడవ్రే
ళ్ళుండ చుట్టికోక గట్టి యుయ్య - లెవరు వైచిరో?
చామ చేను కొఱ్ఱ చేను - చల్లు మొలిచి పండు ఆ
సీమవాన మబ్బువ్రాలి చెలువు - గొలుపుచుంటెగా!
ఏ మనుజులు గానరారు! - ఎవరు వైచిపోయిరో
గోము సెడని బిడ్డకొఱకు - కొసరి వ్రేలు నూయెలన్?
దారి ప్రక్క బాటసార్ల - దయకు బాత్రమౌనటుల్
చేరదెసి కనులు గలుగు - శిశువు నిదురవోయెడిన్!
కేరు మనగ జేరవచ్చె - కెలన పుడుకలేరు తల్లొర!
ఆపె వైచి యుండునల్ల - గొప్ప యుయ్యెలన్!

## వానమబ్బా! నీకు స్వాగతము!

వానమబ్బా! నీకు స్వాగతము!
ఈ విప్పుడేతెంతు వనియెంచనేలేదు
ఎల్లియో యెల్లుండియో యంచు నే మఱతి
ఎప్పుడో మట్ట మధ్యాహ్నమున వత్తువని
ఎంతో వేడిగనున్న యెడల గన్పట్టుదని
ఊహగొని నేనుంటినో వానమబ్బా!
కాని చల్లని తెల్లవారుఝామునవచ్చి
గాఢనిద్దురనున్న కదపిమమ్ములలేపి
కురిసితివి కురిసితివి కోమలవు నీ చినుకు
మెఱసితివి మెఱసితివి మేలైన నీ మెఱుపు
ఉరిమితివి ఉరిమితి యూఱకే నీ యుఱుము
ఆనందమయ్యె నా కాకస్మికంబైన

నీ రాక నీ చినుకు నీ రవళి నీ తళుకు
ఏమందువా నిన్ను నిన్నెంచుకొనుచునెయుంటి
మిన్నాళ్ళు; ఈనాడు యీ తృటిని గాకున్న
దీర్ఘ గీతష్మాహ్నముల్ తీఱుపోయెను మాకు
చల్లగను వాన నీ చలువ చేతను గురిసె
వానకాలమువచ్చె వసుధ పచ్చనహెచ్చె
వానమబ్బా! నీకు స్వాగతము! స్వాగతము!

## రహస్యము

నీవు నా మనసెంత
నిశ్శబ్ద నియతిమై - పొంగిలించితివన్న—
తూర్పు దిశను - చల-చల్లనెఱ-నెఱ్ఱ-మెల-మెల్ల-
తలచూపు సంపూర్ణ - చంద్ర ప్రశాంత బింబ
సందర్శనముకంటె - సడిసన్న!
ఏమందువా? - మొన్న
శ్రీరంగ పట్టణప్రాంత పర్వతసీమ - ప్రాలినపుడు—
రెండు కొండల నడుమ - నిండుకొలంకుపయి
వెదురు బిడెపులోయ - వెంబడిబడి—
కనుబండువుగ దొర - గనుబండు పండిన
నుండు సొబంగున - నుదితమైన—
పౌష్య పూర్ణిమ చంద్రు - బరికించితినిగదా!
ఆనాటి యాశాంతి - యానవానూనాప్తి
నీ ప్రేమ నిశ్శబ్ద - నిర్మాణమో యనగ
దోచినది! తోచినది! - చూచితిసరి!—
కలువపూవిక నిదుర - గాంచుచున్నట్లుంది
ఒకపక్షి కూజితం - బూహయిడదె!—
నేను సయితము దాని - నేరకయు పోయితిని
కొంతసేపదియెదో కొండవెలుగు-అనుభ్రాంతి జూచితిని!

# వెట్టి ఉయ్యాలా!

వేశానే వేపసెట్టుయ్యాల— వో పిల్ల!
ఊచానే రావిసెట్టుయ్యాల——వో పిల్ల!

కట్టాను! సింతపూ వన్నె!
ఎక్కాను! సింతపూకొమ్మ!
వేపసెట్టూ కేలవేశావో—వో బావ!
నీ పొంగు వుయ్యాల?
రావిసెట్టూ నేలవూచేవో—వో బావ!
నీ రంగు వుయ్యాల?

గోరింక కొనగోళ్ళు - పసుపుబూసినగోళ్ళు
గోరింక కొసముక్కు - పసుపురాసినముక్కు
వేపకొమ్మాలంట ముంగూరులే—వో పిల్ల!
రావికొమ్మా లంటదంతాలే—

నిమ్మసెట్టెక్కావ? తుమ్మసెట్టెక్కావ?

నిమ్మసెట్టెక్కితే - నిమ్మకొమ్మాలంట——నింపళ్ళే!
తుమ్మసెట్టెక్కితే-తుమ్మకొమ్మాలంట—తుంముళ్ళే!

నిమ్మముల్లేమాయె? - తుమ్మకాయేమాయె?

తుమ్మకాయా గొలుసు నీకాల—వోపిల్ల!
నిమ్మముల్లూ దురుసు నాకాడ
వేశానే మఱ్ఱిసెట్టుయ్యాల—వో పిల్ల!
ఊచానే మద్దిసెట్టుయ్యాల—వో పిల్ల!

కట్టాను! సింతపూవన్నె!
ఎక్కాను! సింతపూకొమ్మ!
మఱ్ఱిసెట్టూకేలవేశావో—వో బావ!
నీ మంచి వుయ్యాల?
మద్దిసెట్టూనేలవూచేవో—వో బావ!
నీ ముద్దు వుయ్యాల?

కో అందా? తోటసూరాతంట పిల్చిందా?
కోయిలాయి! ఏమంటేం?-చిలకమ్మ! రమ్మంటేం?
ఓ పిల్ల! నీమల్లె! - సింతపై నునుసిగురు యూసేనా?
ఓ బావ! నీమల్లె! - సింతకిందాకైత వ్రాసేనా?
హాయిహాయి! ఏమంటేం? నీకమ్మ పొమ్మంటేం?
కట్టాను! సింతపూవన్నె!
ఎక్కాను! సింతపూకొమ్మ!
మావిసెట్టూకేలవేశావో—వో బావ!
నీ చేవ వుయ్యాల?
వెదురుసెట్టూనేలవూచావో—వో బావ!
నీ కుదురు వుయ్యాల?
మావిసెట్టూసుట్టుమడిబట్టే—వో పిల్ల!
వెదురుసెట్టూకింద వీబూదే—
తిన్నగా కొలిచేవ?
మావిసెట్టూసుట్టుమైలుంది
వెదురుసెట్టూకింద గాలుంది
కట్టాను! సింతపూవన్నె!
ఎక్కాను! సింతపూకొమ్మ!
అడవిసెట్టూనేలవేశావో—వో బావ!
నీ గోటు వుయ్యాల?
భావిసెట్టూనేల ఊచేవో—వోబావ!
నీ పట్టు వుయ్యాల?
తెగుతుందా నాపట్టు వుయ్యాల?
పడుతుందా భావిలో నీనీడ?—వో పిల్ల!
కట్టావు! సింతపూవన్నె!
ఎక్కావు! సింతపూకొమ్మ!
భూంవంత లాల్మట్టి రేగేనే
సొర్గమే జల్మెత్తి సాగేనే.

## స్మృతి

ఎన్నాళ్లు నే వెన్క - కీ ఫక్కి లెక్కస్తై
చక్కన్ని యా ఘడియ - సంస్మృతికె దొఱకు ?
కమ్మన్ని యా ఘడియ - కన్నులా బడును ?

పుట్టినట్టీఘడియ - పుట్టిబుద్ధులు గఱచి
ముద్దుగున్నాఘడియ - సంబుద్ధి నిన్నెంచి
సకియ యని యనుకొన్న - చక్కన్ని యా ఘడియ
నెన్నాళ్ళు నేవెన్క - కీ ఫక్కి లెక్కస్తై.

జీవనంబున కదియ - జీవగఱ్ఱగదోచు
భావనంబున కదియ - పరమావధిగదట్టు
ఆ వేళవంటిదిక - నేవేళ కలుగబో
వెన్నాళ్ళు నే వెన్క - కీ ఫక్కి లెక్కస్తై.

కౌగిలించిన ఘడియ - కపురంపు విడెముతో
దావిగుప్పిన ఘడియ- తళుకుమన్నా ఘడియ
తలపుగొన్నంతనే - తట్టినట్టీఘడియ
కాదు కాదో సఖీ! - కళ్యాణపుం ఘడియ
కళ్యాణపుం ఘడియ - గడకొత్తు క్రొంఘడియ సీ!

ఎన్నాళ్ళు నే వెన్క - కీఫక్కి లెక్కస్తై
చక్కన్ని యా ఘడియ - సంస్మృతికి దొఱకు
కమ్మన్ని యా ఘడియ - కన్నులాబడును.

## ఇక్కడ

ఇక్కడ కోయిల వినబడినట్టు - ఎక్కడ కోయిల వినబడదోయి!
ఇక్కడ కొండలు గనబడురీతి - ఎక్కడ కొండలు కనబడవోయి!
ఇక్కడ కొలనులు నిండెడులాగు-ఎక్కడ కొలనులు నిండవు-ఓయి!
ఇక్కడనాహృదినినదించెడుబలె- నెక్కడనాహృదినినదించదువోయ్!

## చుక్కల్ల చూపులా

చుక్కల్ల చూపులా - చూపు చూచేను
వెన్నెల్ల నవ్వుతో - నవ్వు నవ్వేను
ఎవతె నా ప్రియురాలు ? - ఎవతె నా దయిత ?

దక్షిణా నిలముతో - నిట్టూర్పు విడిచేను
మంచు బిందువులతో - నించేను కన్నీళ్లు
ఎవతె నా ప్రియురాలు ? - ఎవతె నా దయిత ?

భానూదయపు వేళ్లు - గానంబు సేసేను
పక్షుల్ల పూవుల్ల - పలకరించేను
ఎవతె నా ప్రియురాలు ? - ఎవతె నా దయిత ?

నిశ్శబ్దగర్భాన - నిదురపోయేను
నిబిడాంధకారాన - నేను దెలిసేను
ఎవతె నా ప్రియురాలు ? - ఎవతె నా దయిత ?

## సొంత చలవ

మెఱపులే కనుసైగలూగ - ఉఱుములే తప్పెటలుగాగ
భ్రమసపోతూ నడనునేను - కమలి పోదునవా ?
అమలవర్షము గురియజేతువు ; - వలదు—వలదది
చెట్లకొఱకే, పూలకొఱకే - చిగురుజొంపం చెలగుకొఱకే
చిలుకుదేవా ! చిన్నవర్షము ;-దిమ్మరించుము తీవ్రవర్షము.

కలదునాలో కనకబాష్పము - శోకబాష్పము
అచ్యుతంబది నేటికిని భువి ;-దాచుకొనుచున్నాను దానిని
అమృతమ్ముగ నెప్పటికి ప్రభు !
నీదుజాలి మహాప్రవాహము-జాలుగా నామీద జనునపు
డందులోమిళితంబుచేయను-డెందమున నిలబెట్టుకొన్నాన్
సొంత చలువగ ! - శోషయెటు నాలో ?

## చూడే

చందాయి తెరచాటు - చక్కన్ని చుక్క !
తొంగిచూడే! నన్ను - పొంగిచూడే !—

ఆకాశగంగలో - కరగిపోయిన చుక్క !
నిలిచిచూడే! నన్ను - పిలిచిచూడే!—

అంబూధి గుటకలో - అస్తమించిన చుక్క !
పలికిచూడే నన్ను - పనవిచూడే!—

భానూదయము ముందు - భస్మమైనా చుక్క !
వెండిచూడే! నన్ను - కొందజూడె !—

## వెన్నెలకు

అమృతమ్ము చిలికేది హేహిమాంశూ !
నీ అసిత భాగమ ?
లేక నిద్దంపు దెలిరేక ? హేహిమాంశూ !
అంద మొలికించేది హేహిమాంశూ !
నీ మబ్బుల్ల పయనమా ?
రిక్క సంయోగమా ? హేహిమాంశూ !
నిను ముక్తిగొలిపేది హేహిమాంశూ !
అమవాస చీకటా ?
ఆకాశ గర్భమా ? హేహిమాంశూ !

## అంతా

ఈ విశ్వమంత నా హృదిలో - తాండవించు చున్నదోహో !
నను గనుగొను చూపులతో-గొనబులయగ జూచుచుంటి ;
నను వినుకొనువారి చెవిన్ - నినదించెదు నా నాడి ;
మునుపు నేడు ముందేకాలం-అనుకొనులో నైక్యమయ్యె ;
ఆకాశం, అవని, గాలి - అంబు, వగ్ని, ఆత్మ మెఱయు ;
ఈ విశ్వమంత నా హృదిలో - తాండవించు చున్నదోహో !

## నిశ్శబ్ద వీణపై నిర్యాణ గీతి

అలకంటె ముందుగా దరిబడితినేను
అలరెచ్చి కొడితేను ఆలకించాను
నిశ్శబ్ద వీణపై నిర్యాణ గీతి.

నింగికంటే ముందు నేలకొచ్చాను
నింగి నేలనుమోవ సీటుగావిన్నా
నిశ్శబ్ద వీణపై నిర్యాణ గీతి.

నీకంటె ముందుగా నేను బుట్టాను
నీ జాడతోనాడ శ్రుతపర్చుకున్నా
నిశ్శబ్ద వీణపై నిర్యాణ గీతి.

## ఎన్ని యున్నాయో ?

ఊహదట్టక మాయమైనవి - ఊహదట్టీ గేయమవనివి
గేయమయీ పూర్తిగానివి - ఎన్నియున్నాయో ?
నాకలం వెంబడి నెన్నియున్నాయో ?—

మెఱసిపోతయి, మెదలుతుంటయి
వదలిపోతయి వస్తువుంటయి
అన్నియిన్నని చెప్పలేను! ఎన్నియున్నాయో!
నాకలం వెంబడి నెన్నియున్నాయో ?—

ఒకటి కెరటంలాగు మోగు-ఒకటి కిరణంలాగు తగులు
ఒకటి నాలోనాకె తెలియకె
ప్రకటితంబయి ప్రకంపించు - నెన్నియున్నాయో ?
నాకలం వెంబడి నెన్నియున్నాయో ?—

పట్టలేనూ వానినేను - పద్దెముల నరికట్టలేను
పాటలన్ బంధింపలేను - జ్ఞాపకము రాగానేమాత్రం
నావిగా భావించుకుందును
ఆ విధిని జీవించునవి యవి - యెన్నియున్నాయో ?—

## తొలి తొలి - మలి మలి

నాహృది దొలితొలి పాటన్-వెలలించుట యెందుకొరకు ?
పాటవెంట వెనుకొని నవ - నీరవసుఖ మెదనెలకొన ;
నా హృది మలిమలి పాటన్-వెలలించుటయెందుకొరకు ?
తొల్లిటిగేయపు బ్రతిరుతి - నా చెవులకు సోకనుండ ?
తిరిగి తిరిగి పాడితినా,
అది నే నెరుగని సుఖమెదియో ? ఓహో !

## పరమ సంతోషంబు

పాడలేకుండుటే - పరమ సంతోషంబు ;
నా నీడలో నేను - మానుగా కూర్చుండి
పాడలేకుండుటే - పరమ సంతోషంబు ;
నా యూహలో నేను - చాయగా నిలుచుండి
పాడలేకుండుటే - పరమ సంతోషంబు ;
నా ప్రేమతో నేను - ఊపిరాడక మిగిలి
పాడలేకుండుటే - పరమ సంతోషంబు.

## అడ్డము

ఆ కొండ కనుక నా కడ్డము - లేకపోతె బాలసూర్యు
డేకడ నగపించువాడొ ? - ఎంతదూర ముండువాడొ ?
ఇపుడు కొండవెనుకనుండి - ఎంతొ చక్క బొడసూపుట
చేతగదా చిత్రముగను - చేతో మోదముగూర్చుచు
శిఖరమ్మును సిందూరపు - నఖమనగా బైకిజూపి
అది సింహాచలమనియన - నద్దానివెనుక నరుణమనగ
ఆశ్చర్యము గొలిపించెడు ;
ఆ కొండకనుక నా కడ్డము - లేకపోతే బాలసూర్యు
డేకడ నగపించువాడొ ? - ఎంతదూర ముండువాడొ ?

# శంషక్క

శాద్వలంబులో - ఆరుద్రక్రిమి
చక్కనాకుమడి - ప్రక్కనగువ్వ!
ఎవరులేని యీ పుంత - కిటూ అటు
బలుసులు, గోగులు - పిచిక బీరలు.
నూగు తీగలు - నునుపువ్వారాల్!
చూడలేదు నిను - కోసుకొ గడ్డి!
కానలేదు నిను - తీసుకొ కలుపు!
ఏమిచేస్తువో - చేలో!
కూలికూతురా! - ఆలో?
వెన్నెముకకు - పొట్టంటుకుపోన్
కళ్లులోతులకు - ఇఱ్ఱింకిలుగాన్
పంటవలంతి - నెండినదేది?
నీవా? కూలికూతురా! - త్రోవా?
బుగ్గదరిద్రత - నెత్తురువుడుకు!
దగ్గఱగాబడ - సిగ్గుల అమలు!
కూలికూతురవు కావా?
జివసప్పకు - లేదాజావ?
తవసదావృత్తి-మహాగ్ని-పర్వతపులావా?
అయినప్పటికెద - ప్రేమకుతావా?
వయసీ!.................ఇసి!
నీ ప్రియం - భావుకము - చావా?
నీ చితి మండగ - నెండు ముళ్లేన్ - రావా?
నీ కోరిక లీభువి - తీరవ? లేవా?
శాద్వలంబులో - ఆరుద్రక్రిమి!
చక్కనాకుమడి - ప్రక్కనగువ్వ!

## కళకు నాయువు

చింతచిగురులో కలసి మెలసి - రంగుచీర చెరంగుదాటే
పొంగిపోతూ నవ్వుపణతికి - జవ్వనము కొదవా ?
సంతజనమున చక్క మెరసి - తేనెగాజుల తియ్యమ్రోతే
జానుతెనుగుల పలుకుచేడెకు - చక్కదన మెరువా ?
కొండమేఘపు నీడనిలిచి - ఎండకాంతుల జూచుచూపే
చెమట చెమరుచు శ్యామలాంగికి - సౌహార్ద మసదా ?
రాళ్ళలో పరువుళ్ళుత్రొక్క - నల్లనీళ్ళ కృష్ణవేణికి
నడకనేర్పిన ధాన్యకటకపు - గళకు నాయుక్షీణమా ?

## మిన్నుచుక్క ?

క్రుంకేటి సూర్యుణ్ని వొరుసుకొని పోతూను
పొంకాలుసూపేని పొడుగువఱద ;
దిఙ్మండలల ద్వారబంధాలు కడిగికొని
పసుపుకుంకుమ మద్దె మలుసంజ !
మలుసంజకాలమా ? అవకాశమా ?
ఏమికానట్టి తొలుసంజ ప్రేమేనా ?
వఱద మలుపులవెంట వయ్యార మొలికిస్తు
పిలిచి చెప్పంబోలు పేరంటము,
జలజాక్షులెందరో జాల్వారునదిప్రక్క
జాలంబుచేసేరు రాత్రిపడిన ;
జలజాప్తు దొఱిగేడు ఇలయంచె కునుకుతూ
మొలకెత్తు వెన్నెలలు తలపోయడో ?
కునుకులో అతగానికల యదేకాబోలు !
మబ్బుమెఱపో ? మఱి మినుకుచుక్క ?

## ఎగుడూ దిగుడూ

ఎగుడూ దిగుడూ కొండల నడుమ
వంకర టింకర మేఘం తగిలి
మాటాడక తెలి నిదిరిస్తూంటే
నా లోపల నీకల యెందుకురా ?

నాలో నాకీ కలతెందుకురా ?—

ఊపిరి తిరుగని యుదధి యలలపై
ఉఱ్ఱుట్లూగే సంధ్యాదేవి
కునుకుతు కునుకుతు గొప్పవెలుగుచో
నా లోపల నీ కులుకెందుకురా ?

నాలో నా కానంద మెందుకుర ?—

గోపకు డెఱుగని కొసకొమ్మలలో
కాపడకుండా పికంబుగూస్తూ
మాయంబింకా అయిపో నెగిరితె
నా లోపల నీ దుముకు డెందుకుర ?

నా లోపల నీ నెమకు డెందుకుర ?—

తెలియగ లేనుర నాదగు భ్రాంతి,
నాదగువంత, నాదు విలాసం, నాదు వికాసం
దేనినిబట్టి పుట్టిపెరుగునో

తెలియగ లేనుర ! తెలియగ లేనుర !—

## వేగుబోక

పల్లెటూర - పుంస్కోకిల - ఉషాదేవి - చల్లబొద్దు
హుషారూను - కుఖూ ! కుఖూ !
పల్లెటూర - కోడిపుంజు - అనూరన్న - మనోరథపు
గొండకెక్కు - కొకుర్ కొహెూ !

పల్లెటూర - పిల్లగాలి - ఉదయభాను - సదయదృష్టి
తెప్పలూచు - నొహెూ ! ఒహెూ !
పల్లెటూర - నాడపడుచు - సర్వతో - ముఖాంకఱు హిమ
మలికి - చిలికి - చిగురువేయు.
పల్లెటూర - బ్రహ్మదండి - నిట్టవెరిగి - పూసి తేటి
కొలుపు - మఱుగు - కలుపలరహి !
పల్లెటూర - పొలంకాపు - నింగిచలవ - నేలచలవ
నంగమొుల - వేల్పుగట్టు.
పల్లెటూర - వేగుబోక - నెల్లవారు - మేలుకొంద్రు
మేలుకొనుటయే - కృషి ! కృషి !

## డిండీర సూత్రము

నీలాల కొండల నడుమ - తాపెత్తు లేచిపోయి
కొదమవరద వానకాళ్ళ - కెదురెగి ముద్దెట్టేన ?
గోదావరి నీటివెల్లి ! - జోహార ! నీకుతల్లి !
ఏనాటి కఱము కతన - నీకింత కడిమి కలిగె ?
ఎన్నాళ్ళో కన్నమ్మ కడుపున-దాగియున్నావాగియున్నావ ?
ఏనేస్త సెప్పె నీతో - దవునున్న సాగరుగూర్చి ?
వగలాని నిట్టూర్పులే - వచ్చిపడ్డాయమీద ?
నిట్టూర్పులోనే తియ్య - న్నీరెట్టి పంపినాడా ?
గొడ్డుమబ్బొకట్టి నీతో - జతగూడినట్టులేదు
తొలిమబ్బే తొలుమబ్బగుచు - మెఱసేన్ మలిమబ్బుతగిలి
ప్రేమికుని ప్రణయమంత్రం - వినిపించె నెపుడు నీకు ?
డిండీర సూత్రమువోసి - భూమి బంధించిననాడె ?

## కొత్త పాత

ఎవరోయి కొత్త ? - ఎవరోయి పాత ?
ఎవరిని ఎరుగుదు నంటావు ?-ఎవరిని ఎరుగని అంటావు ?
పూలను బొడమేతావి - గాలిని బ్రాబడితగుల—
ఏటిని బైబడు తుంపుర - ఇసుకను నద్దుకు మిగుల—
ఇంద్రధనస్సు వంపు - ఇలపై వ్రాలగ జిగుల—
ప్రియురాల్ విసరినచూడ్కి-బ్రియునకుహృదయంపొగుల-
ఎవరోయి కొత్త ? - ఎవరోయి పాత ?

## నదీ జిజ్ఞాస

" నీడదట్టపు మాకులన్నీ - మోడులయి పడిపోక పూర్వమె
తలిరు తోరణ మలంకరణముగా నొనర్తుపథిన్ ;
కొండపూచిన పువ్వులన్నీ ఎండిరాలక పూర్వమే
దండగుచ్చి ధవుడ! నీదు మెడను వైచెదరా !
చిన్ని నా యాశయము తీరే సమయమునకౌరా !
కారుమబ్బులు కమ్మిపోయి కఠినవర్షము కురిసినదదియై
ఎన్నరాని మహాప్రవాహము నన్నలముటేమీ ?
నా మాకులన్నీ నేలమట్టంబగుచు నామీద
ఎండుదుంగలు కంప తొడుగులునా ?
నా పువ్వులన్నీ వడలిపోతూ రూపుమాయుటలా ?
విస్తరిల్లినకొలది స్వేచ్ఛలి స్వర్తిరమొకటే నా
వస్తువనుకో ఒడ్లుమోసియొరసి చనునపుడు,
భూమీజములు మునుముందు పచ్చగ తోరణాలైతే,
పూలు వెంబడి ప్రస్ఫుటములై పరిమళిస్తుంటే,
ఎంత పొంగిపోయేవాడో ! ప్రియుడు సాగరుడు ?"

## క్షణక్షణము

క్షణక్షణము నా హృదయం-బూరటిల్లు నట్లుంటుందోయి!
క్షణక్షణము నా హృదయం నీరసిల్లు నట్లుంటుందోయి!
పాడనె అక్కర్లేదు; ఆడనె అక్కర్లేదు;
ఊరికే కూర్చుంటేనే—క్షణక్షణము.

సముద్రానికున్నాయి కెరటా లొకవేయి
పడుతులేస్తు విరుగుతుఅవి పరుగులెత్తుతుంటాయి,
నా హృదయానికి కెరటాల్లేవు
అయినా, అయినా, అయినా,—క్షణక్షణము.

ఆకాశముకున్నాయి, అంబుదాలు అర్బుదాల్!
కురిసి వెలిసిపోతాయి, మెరసి యుఱుముతుంటాయి,
నా హృదయానికి మేఘాల్లేవు
అయినా, అయినా, అయినా,—క్షణక్షణము.

చెట్లు చేమలున్నాయి; పుట్లు పూలుపూస్తాయి;
పూసి వాడిపోతాయి; నా హృదయానికి పూలులేవు
అయినా, అయినా, అయినా,—క్షణక్షణము.

ప్రియుడు వచ్చిపోయే వయిన మెదనుదట్టు;
రాకపోక కెడము ఉండబోదు; విడము
రెండు సారెసారె; తెలిసిపోయె బళిరె!—క్షణక్షణము.

## వరదనే పసరికపాము

లంకముంచిన లంకమీద డొంకముంచిన
డొంకప్రక్కన పొంకమగు పెదచెట్టు ముంచిన
ప్రళయగౌతమి వాహినీ జలమందు
పసరిక పాము నడచిన మెలికలేమందు?—
కూలిపోయిన చెట్లపచ్చ - గిలగిలా మనునట్టి తుదివెత
కనులగట్టే రూపమయ్యెది!-కసివహిలపున వరదయెడదను

విసము గ్రక్కియు చాలకున్నది!—
తూలుచున్నది! దాని తీసేవారు లేరే ?—
వంపకొప్పుల అప్పలందఱు - డొంకెనలు పైకెత్తి బెదరున
అడలువార " లే మల్లొప్పా " మని ;
తెప్పలుప్పొననేని నడపెడు-నప్పురుషులకు నతిభయంబే!-
అమృతహస్తుం డుదధుడొకడే-అతిసమర్థుడు వీకనందుకు
దానికిని బ్రాణంబునిలుపను;-నిలిపినాడనుకొందమింతకు;
సకియ గౌతమి చాల శ్రమపడి
తనకు దెచ్చిన మరకతంబుగ దాల్చువాడో ?
చీల్చువాడో ప్రజకుచేటని ?—దానిప్రాణము తోడకూడా
నాదు భావము కొట్టుకొనియెడు—
ప్రక్కపారంబెక్కె నయ్యది!-గట్టుపచ్చన గలిసిమెలసెను
ఎవరిసాయ మికక్కరేలే! - నీటితో పోరాటమేలే !
పసరిక పామెరుక వడదిక!-దానిప్రాణము కొఱకదేయన !

## ఎవని పాదధూళి

ఎవని పాదధూళి, కళ్ళ - బవనము లేకుండ గప్పు ;
కప్పిన వెఱిచూడ్కి యొప్పు ;
అట్టిదేవునకు - నమో ! నమో ! నమో !

ఎవని మూర్తిదీప్తి, పగటి - రవికి బూర్వమందె లేచు ;
లేచిన నను లేతనిలుచు ;
అట్టిదేవునకు - నమో ! నమో ! నమో !

ఎవని కలను, నాదు నిదుర - కవనముగాకుండ నఱగు ;
అఱగిన దుదిమనసు తొనకు ;
అట్టిదేవునకు - నమో ! నమో ! నమో !

## తోకచుక్క

ఎవరు రమ్మన్నారు ? ఎవరు పొమ్మన్నారు ?
వచ్చిపోయినదారి, విప్పచ్చునసునైన - విశదంబుగాదరే !
తలతోకసర్వంబువెలుగుమయమైయొప్ప - విశఖురుచెప్ప?

నీ త్రోవలో దేవుడున్నాడటే ?
పాతప్రశ్నగదీని తీసిపారేయకుము ;
నీ త్రోవలో దేవు జూచావటే ?
ఎవని కుశలముసెప్ప నేతెంచినావో
అతనిమాటేచెప్పు ఆలకిస్తాను
అతిథి వీవంటూను ఆదరిస్తాను.
ఈతిబాధలె చాటు ఘాతుకలె సూచించు
ఇంక ఘోరంబులౌ యుద్ధాలె ఘోషించు
అందులోనే మధ్య నేకోశమందునో
దేవుడున్నాడంచు నెఱుకపల్కావేవ ?
అదిచాలు - మరివలదు
సకలావకాశముకు సాధువీవంటాను
సంశయింపగ నిన్ను సత్కరిస్తాను.

## మహాదృశ్యము

కొండెక్కాను-వీక్షించాను-వేసంగిసూర్యుడు-క్రుంగిపోవుటలు.
కొండెక్కాను-వీక్షించాను-శుక్లార్థేందుడు శూన్యంబౌటలు.
కొండెక్కాను-వీక్షించాను-అక్షయతారలు స్వప్నాలల్లుట.
కొండెక్కాను-వీక్షించాను-హృదయమ్మిదకు
ఆకాశంధిగి - ఆవలించి దా - నిదరోవుటలు.

## ఉన్నావ నీవచట ?

భూదేవి హృదయ కంపనమెంత సడిగలది ?
భూదేవి రక్తనాళము కెంత వడియుంది ?
ఊగిపోయాను నే నొరగిపోయాను,
చుక్కలే గొలుసులై వ్రేళ్ళకందాయొ ?
ఘనతటిల్లతచేతి కర్రగా అమరిందొ ?
సూర్యచంద్రులె డిగి జబ్బలట్టుకున్నారొ ?
పడలేదు పూర్తి ; నా తల పగులగాలేదు,
ఎవరోయి అక్కడ ? " నేను సోదరుడ !"
" ఉన్నావ నీవచట ?"

## పక్షి, పాంధుడు, పరమేశుడు

" రావిచిగిర్చి - మావిచిగిర్చి
ఆవసంతు డెద - రాడుతువుంటే,
ఎవ్వని రమ్మని - కోయిలపిట్టా !
కూసేవింకా - కుహూ కుహూ మని."

" రస్తా, పోతూ - వస్తూవుంటే
బాటసారి నిట - నీడనిలిచి నా
జాడ బిలువమని - కూసేనింకా
కుహూ కుహూ మని కూసేసింకా. "

" పక్షిపాటనే - పాంధుడు పిలిచితె
పాంధునిపాట - పరమేశుడు విను ;
మాఱుమ్రోసెనే - నాలుగుదిక్కులు
కుహూ కుహూ మని మఱుమ్రోసెనే !"

## నిజమే ? నిజమే ?

చిట్టిచుక్క నీవ్ - చీకటిలోనే
చేతులుచాచి - నెమకి కొందువట !
నెమకి కొనుటలో - మినుకుమందువట !
నిజమే ? నిజమే ?—

చందురుడా ! నీవ్
చీకటిలోనే - తెరచాపెత్తుక
దారికోసమై - పయనించేవట !
పయనించేలో - ప్రకాశింతువట !
నిజమే ? నిజమే ?—

పద్మబాంధవా ! - చీకటిలోనే
అనూరునింగొని - దారికోసమై
మందేహులతో - పోరాడెదవట !
పోరాడుటలో - పొద్దుపొడుతువట !
నిజమే ? నిజమే ?—

అలాగైతే అలకింపుడీ - రిక్కసురాజ్ఞీ !
ఓ చందమామా !
పద్మబాంధవా ! - కనుడీనన్ను !
సిగ్గెందుకు ? న - న్నిరులు గమ్ముచో
విరులు పాయవడ - పాట చిమ్మెదన్ !

## అప్పన్న

అప్పన్న ! అప్పన్న ! సిమ్మాద్రి రప్పన్న !
పప్పులెడతానీకు కదులన్నా !
పల్లితెల్లి కలుపు నాబెమైనవన్నె - వొళ్ళిళ్ల నునుజాను—

పళ్ళుపెడతా నీకు పద అన్నా!
మూపురంబు పెద్ద గోపురంబులాగు-ఔపడుతూ వుంది!—
అయిన లెగు అన్నా!
దారినుంటే యెట్లా? రాదారి అప్పన్నా!
గంగడోల్దువితోల్తా నడు అన్నా!

## నా మంచిపాట

నా మంచిపాట నాలో నేనే పాడుకుంటాను
నే పైకి పాడ
నే పైకి పాడే పాట యెల్లారెండోరకమేను—

నా కలమ్ముంచి, కాయితాన్నుంచి "కైతా!" అంటాను
నే నేమి వ్రాయ
నేవ్రాస్తే వచ్చేదంతామేలిం, వ్రాయనంతేను ...నా

నా యెతదాపెంచి, కళ్ళానించి, నవరస మొలికిస్తా
నా పెదవీ విప్ప
ఊపీఊపి నాల్క్రచివర నాచియూకొడుతూ ...నా

నే లోకంగాస్తూ, శోకంమూస్తూ, లోలూపునైపోతా
నే నేడ్వా నవ్వా
నా చెక్కిళ్ళంటా కాఊనీళ్లు నవనాళ్లనింకించి ...నా

నే బేరం సారం, దూరం భారం, నేరాను కించిత్తు
నే నేమీ కోర
నా గడపాకొచ్చినన్నూబిల్చి, ననుగొనిపోతూంటే ...నా

నా రాజ్యం పూజ్యం, రాగం త్యాగం, నేనే రాజ్ బంటు
నా కెవరూ లేరు
నా నాణెమెంచిసంచీనిడించి,నాదంటెయేదంటూ...నా

నే కవినీగాను, కథకూడగాను, ఏ కాలంగలయే!
నే నిదురా బోను
సిరామెదిపి, సిరావిదిపి, శ్రీరామ సుశ్రీనె ...నా

## సయ్యాటా! తియ్యంపాటా!

నల్లన్ని మట్టికీ - తెల్లన్ని నురువుకూ - సయ్యాటా!
నది పిల్లపాయకూ - ఉదధి కెరటానకూ - తియ్యపాట!

మట్టితో - అరుగేస్తె - మగడ! కూకోరాంటె
అరుగుకే - ముగ్గేసత - తెలినురుగుసంటాడు ...నల్లన్ని

ఒంౘడుమట్టి - చెల్ల! - గుంౘబంతులుగాగ
వట్టినురువూ - మల్లి - చెట్టు పువ్వులుగాగ ...నల్లన్ని

ఓడ - లాకాడాగు - పడవ - లీకాడాగు
నడుమ - సాగరసంగ - మొటినుట్టులేసాగు ...నల్లన్ని

## వఱదనేయంనటి మొంక్కవొంఱి

నే పచ్చ పచ్చ గున్నాను ముత్తైదువా!
నే పిల్లల్తొ వున్నాను ముత్తైదువా!
నే మువ్వటాకు నున్నాను ముత్తైదువా!
నే లంకవిఱిగి వఱదబడితె ముత్తైదువా!
నీవు టెంకాయ విసరబోకు ముత్తైదువా!
నా మువ్వాకు చినిగిపోవు ముత్తైదువా!
నా కోటాకు పైకిరాదు ముత్తైదువా!
నా పిల్ల జెల్ల విడిపోవు ముత్తైదువా!
నే తల్లక్రిందులైపోదు ముత్తైదువా!
నన్ను బ్రదుకు వదలలేదు ముత్తైదువా!
తిన్నయరటి పళ్ళుత్రేంచు ముత్తైదువా!
చేరదేసి కళ్ళునీవి ముత్తైదువా!
జాలిచూపు చూడు నన్ను ముత్తైదువా!
బార పొడుగు చీరచెఱగు ముత్తైదువా!
దారివేసి నన్ను లాగు ముత్తైదువా!
కొప్పుదిన్న బెట్టుకున్న ముత్తైదువా!
అప్పుదీర్తు నాయువొసగు ముత్తైదువా!

## ఆకాశ మాకాశ

ఆకాశ మాకాశ మంత మాయాకాశ
మన్నట్టు పరుగెడుతు వున్నాయి మేఘాలు !
అపరాశ సూర్యాస్తమయపు సుప్రకాశ
మెన్నిక మింగేయుచున్నాయి మేఘాలు !
మేఘాలు ! మేఘాలు ! నల్లన్ని మేఘాలు !
మృగశిర మేఘాలు ! చల్లన్ని మేఘాలు !
గాలేయుచున్నాది, గాలికి కడనున్న
గోదావరి పాయంత కదిలింది కుదిటికి !
కెరటాలు లేచేని, లేచీన కెరటాలు
విరుగుళ్ళు సూచేని, వెఱ్ఱెత్తి యూచేని !
నడిచేటి పడవాను, పాడిచేటి నావాను
నా వొక్క నుడిపోత కాచేని కాచేని !

## చికిలి బంగరు అంచు

చికిలి బంగరు అంచు - చేల మట్లున్నదోయి !
మేఘాన్ని అలముకొని - మెఱయు చరమార్కు జిగి !
చూడవోయి ! చూడవోయి ! - పాడవోయి ! పాడవోయి !
“ దినదినము చూచేదె - దినదినము మెఱసేదె !”
అనకోయి ! అనకోయి ! - వినవోయి ! వినవోయి !
మనకోసమేనోయి ! - ఎంత నిశ్శబ్దంగ !
ఏన్నిరాడంబర శాంతముగ
నస్తమయ మగుచున్నదో ! అటు !
ఏంతగా నున్నదోయి !
అంతమగు సూర్యు ననంతరుచి కా దటోయి !

# సుకారిపిల్లి

ఆ పిల్లకేసి నే జూస్తే యౌవనవతి యని చెప్పి చూడలేదు;
సొగసైన చేడె మిన్న యని చెప్పి చింతన మిడలేదు;
పిల్ల తనదు నెఱికురుల నల్లుకొన్న తెలిగవ్వల—
పిల్ల తనదు మణికట్ల వేసికొన్న తెలిగాజుల—
పిల్ల తనదు పాదములకు బెట్టుకొన్న చిఱుమువ్వల—
నలరి, తలరి, యరసితినొహొ!

సుకారి పిల్ల వికా వికా నవు లొకేవితముగా,
కోడెదూడకంటె కొమరు మీఱియుండె
దూడ మెడను మువ్వ, దూడ మెడను గవ్వ
చేడె మిన్నగవకు, చెడె మిన్నమువకు
జోడుగుండదన్నా వాడిమాటగాదు, స్వేచ్ఛకూడ నంతే;
పిల్ల కోన నడుమ నుల్లసిల్లుతీరు, మళ్ళి చూడమెందు;
బొంత పరికిణీపై వింతరంగు పయిట—
పురిటిపొద్దు కాంతిన్ వెఱగు గొలుపుచుండె.

"రాగిడిస్త పిల్లా! రంగుగాజులేస్తా!
అంగడిలో నీ కమరే అన్నినగలు తెస్తా!"

"వద్దు నాకు మాంవా! ఎద్దు నమ్ముకుంటూ
ఎద్దు మెడను గవ్వ, ఎద్దు మెడను మువ్వ
దిద్దుచుందు నేను, దిద్ది దిద్ది దాని ముద్దుగొందు నేను;
దానికంత సొగసు వేనివలన వచ్చె?
గవ్వవలన కాదె? మువ్వవలన కాదె?
గవ్వఅంటె గవ్వా? కడలియోర గవ్వ!
మువ్వఅంటె మువ్వా? నవ్వకోరి మాంవా!"

# ఒక నర్మము

యువతి :—

" కాయగాయదు, పండుపండదు-వలపులోనే వడలివడలి
యిలనురాల్చెడు మల్లెపువ్వు - తనదురేకుల్లు
ఎఱ గులాబి యంతె! అయ్యో!-చిట్టి మొల్లకు అదేచేటు!
అట్టిపువ్వులు అవనిపైనిక-నెన్నియున్నవొకో ?"

యువకుడు :—

" నీదు చెక్కిలి యా గులాబిని-వాదులాడెడు వినవుగాక,
నీదుపలువరుసాహొ! మొల్ల! - నీదుచిరునవుమల్లెయరవిరి!
నీకునాపై ప్రేమ మొలచిన - వలపులోనే వడలు మల్లియ
నిలిచి వాసించు! - జిగిగులాబి ననంత మనిపించు!
చిట్టి మొల్లయు చిరంజీవై - వనము నెలయించు!
వట్టిపువ్వులు వసుధపైనిక - జూడ బోమెందు!"

యువతి :—

" నాదుసిగ చామంతి యేమగు ?"

యువకుడు :—

" గగన కుసుమం బయది చెలియా!
నారులేక వేరులేక నీరులేక
నింగినెక్కెను! చుక్కలకు
సిరిచుక్క దానై యక్కజము గొలుపు!"

యువతి :—

" రాతిరా? పగలా ?"

యువకుడు :—

" ఏతరిని జెలియా! ఏల రేబవలు ?"

యువతి :—

"అయితె ప్రేమింతుస్."

యువకుడు :—

"దయిత! నన్నేనా ?"

యువతి :—

"కాదు. సిగబంతిస్."

## దాక్కొని వుంటాయి

దాక్కొని వుంటాయి - దారంట-గడ్డి-నిరుక్కొని వుంటాయి—
తలపగరాని పూలు - పిలువగబోని పూలు
నిలుపగలేని పూలు
దాక్కొని వుంటాయి - దారంట-గడ్డి-నిరుక్కొని వుంటాయి—
గ్రుక్కెడు వాననీళ్ళకు - పక్కన నవుతాయి;
ఉక్కగ గాసంతుంటే - త్రొక్కట పడతాయి
దాక్కొని వుంటాయి - దారంట-గడ్డి-నిరుక్కొని వుంటాయి—
లెక్కకురా, వోలక్ష! - చిక్కవు మాలను గ్రుచ్చ,
ఇక్కడ నక్కడ బచ్చ - జక్కన బూస్తాయి
దాక్కొని చూస్తాయి - దారంట-గడ్డి-నిరుక్కొని కూస్తాయి—
ఒక్కడ నడుస్తూవుంటే - చుక్కలు పొడుస్తూవుంటే,
మక్కువకూర్చ్చమంటాయి-ఎక్కడ యెందుకొ చెప్పవు;
దాక్కొని వుంటాయి - దారంట-గడ్డి-నిరుక్కొని వుంటాయి—
మంచుబిందువు పడిన - ఎంచి బాష్పము విడిన,
అంచుల గాస్తాయి - వంచక మోస్తాయి;
దాక్కొని వుంటాయి - దారంట-గడ్డి-నిరుక్కొని వుంటాయి—

## వెన్నెలా!

వెన్నెలా! నిను - కనుగొన్నానులే!—
కార్తీకం - బహుళ పాద్యం - అర్ధరాతిరి - భద్రముగ నిను
వెన్నెలా! - కనుగొన్నానులే!—
అతివినీలం - ఆకాశం - చందమామ - మందగమనం
వెన్నెలా! నిను - కనుగొన్నానులే!—
చుక్కలెల్ల - చూడసిగ్గయి - చెట్లనీడ - వ్రీడభావం
గొన్నమాద్రి - మెఱసె మిణుగు - ర్మేనులూని-మేదినీపయి
వెన్నెలా! నిను - గనుగొన్నానులే!—
చెప్పవొకటి - చేయవొకటి - వ్యర్థమనులో - నర్థమౌతావు!
వెన్నెలా! నిను - గనుగొన్నానులే!—
ఏటిమీద - పాటిమీద - ఊరుమీద - ఉదధిమీద
వెన్నెలా! నిను - గనుగొన్నానులే!—

## కాంతి - శాంతి

పిలుస్తూ ఉన్నట్టుంది - ఈ సంజ నాకాశం;
తెలుస్తూ వున్నట్టుంది - ఈ గడియ ప్రకాశం!
కొండల్లే మేఘమ్ము - నిండుగాను నిల్చి,
యస్తమించు సూర్యు - నరుణిమ దాల్చింది.
శంఖంలో రేఖల్లే - పొంకంగా మెలిదిరిగి
నక్షత్తిపైలేచి - నాతో నడుస్తూవుంది.
కారునల్ల అల్ల - గోధుం వర్ణంబై
గోధుం వర్ణం మెల్ల - సాధువుగ దొగరెక్క.
నలుదిక్కులా కాంతి - పలువరుసపై శాంతి
కలగలుపుగా జేసి - తెలినవ్వు గొలిపిస్తూ.
పిలుస్తూ వున్నట్టుంది - ఈ సంజ నాకాశం;
తెలుస్తూ వున్నట్టుంది - ఈ గడియ ప్రకాశం!

## కొండగడ్డ

నే నీదాక భూమిపై నున్నానా ?
నన్నిదాక నెవ్వరైన గన్నారా ?

నే కొండగడ్డ నెట్టిచెక్కు నేలబిడ్డనూ,
నా నీటియొలుపు నెత్తుటకిని లేదురాదుగా !

మధ్యాహ్న మెల్ల యెండ మాయమైనను,
సందేళ చినుకుపడ్డ సాగిపోదునూ !

మబ్బు గమ్ముకుంటుపోతె మనసు విప్పను,
మబ్బు మెఱసికుంటుపోతె కనులు గప్పను !

నన్ను జూచి పొంగిపొయ్యే నాథు డెవ్వడూ ?
నేను నేడు కెరలి దొరల నెనరు లెవరికి ?

లేదు దుక్కి, లేదు చేను, లేదు చల్లిక,
లేదు జగతి కేను జేయు నే యుపకృతి !

నడక చూస్తె నాకె వింత నాదమీనెడు !
గడియముందు లేనిదాన్ని గండికొడితిని !

## ఎన్ని చిలకలూ !

ఎన్ని చిలకలూ ! ఎన్ని చిలకలూ !
అన్ని చిలకలే ! అన్ని చిలకలే !
చెలిమి వాటికి ? ఆ శిరీషమూ !
ఆ శిరీషమూ ! ఆ శిరీషమూ !
ఎన్ని చెట్టులూ ! ఎన్ని చెట్టులూ !
అన్ని చెట్టులే ! అన్ని చెట్టులే !
ఫలము లివ్వవూ ! పప్పు లొందవూ !
పప్పులెట్టవూ ! ఆ ప్రియమేమో ?
వేనవేలుగా మూగు నెగురొహొూ !

వెఱ్ఱి చిలకలూ ! వెఱ్ఱి చెట్లపై !
సామరస్యమే సర్వమయ్యెడ !
ఎఱ్ఱ ముక్కులూ ! పచ్చ ఱెక్కలూ !
ఎఱ్ఱ పువ్వులూ ! పచ్చ నాకులూ !

## ఏ ను గ బో లి

ఏనుగుబోలి సింగముబోలి
లీలగనంబడు లేడింబోలి
మాఱుపునుం గొనుచుండె నొకానొక
మేఘము పడమర మలుసంజ !
దిఙ్మండలము నంటీ యంటని
తాళశిఖోన్నత పంక్తిచ్ఛదనము
దాన నొకానొక సరిపీమాకు
నల్లని కాటుక యిడు కనుఱెప్పలు
మల్లడిగొను నెఱి జాడన్ దోచెను
అలోనూడ్చిన వరిపైరొకటే
పచ్చందనమై లోలో జాల్గొను
నీరంబుల రమణీయ రుతుల్ గొని
పిల్ల తెమ్మెరల నొలసి నూదిమొన
తలలువంచి మఱి నెత్తుకొనియెను—
కొండొక బుగ్గల నవ్వు చొట్ట లన—
చాయట బంగారు, చాయిట పసరు, అంతే, అంతే,—
ఎక్కడునుండీ ఎక్కడికొస్తి ?
మేఘమునుండీ మింటికొసక ? ఆ
మింటికొసనె యిటు మిలమిల వెఱిగిన
కంటికింపు వరి చక్కని పైరుక ?
పైరు చాయనే పడతి చాయకా ?
దారితప్పితిన ? లేదు, లేదు, నేదారి తప్పలేదు.

## మాయూరిలో మేము

మాయూరిలో మేము - అన్యోన్యము
క్రొత్తవారల మెంతొ - క్రొత్తవారలము!
ఒకరిపని యొకరికెపు డుండేదికాదు;
ఒకరిపేరొక రెరుగు నూహలేలేవు.
ఒకయూరివార మను నుత్సాహమైన
ప్రకటితముగాక లోపలను మెఱసేది.
ఒకనాడు మేమిద్వురము లాతిపురిని
నెదురౌట కలిగింది ఏమి యనుకొనకె,
చిరునవ్వు ఇరువురకు చెంగలించింది,
ఎఱజిగుల పెదవులను నెక్కడాదాని
చిరునవ్వు ఇరువురకు చెంగలించింది.
చిరకాల పరిచయము చిత్తముల్ గలిపె!
మాపూరి మాక్రొత్త మఱచిపోతి మిక,
ఆ పురి నా యెఱుకె యాత్మల నిలిచె!

## చెట్టునీడ నేను నిలువ

చెట్టునీడ నేను నిలువ - చెట్టుగాలి కూగుచుండి,
"నాదు నీడ లాగుతూంటె - నీవు నూగవేమి? పాంథ?
నాదునీడ సుగముసెంచి-నీవు నూగవేమి పాంథ?"
అనుచు దెప్పినదిగ చెట్టు - అనగ వలసె నేను "మంచి"
దనుచు; నూగికొంటి గాలి - లాగుదాక నూగికొంటి.
ఏటినీరు నేనుద్రావ - నేరుకొండ జిమ్ముచుండి
"నా కరళ్ళు మ్రోగుతూంటె-లోతుగనవదేమి? పాంథ?"
అనుచు దెప్పినదిగ యేరు-అనగ వలసె నేను "మంచి"
దనుచు నీదు కొంటిగొండ - నెక్కుదాక నీదుకొంటి.

నింగివెలుగె నేను నడుమ - జుక్కచదల గాంతిమెఱసి
“ నాదుకాంతి తోడుకొనుచు - నీవు నన్ను నేరవేమి ?
నీదుదారి బోదువేమి ?”
అనుచు చెప్పినదిగ చుక్క-అనగ వలసె “ లేదు. మంచి
దరయుచుంటి” ననుచు, నుదయ-మారుదాకనరసికొంటి

## మేలి పాట

గాలి కెరటములపైబడి - లీల మెయిన్ వినవచ్చెను
మేలిపాట యుండుండి.

అరసితి నలుదిక్కులేను - చాలసేపు చూచితిగడ
నేలలనయు గనబడదొక - యీలవేయు మగవాడున్
వేళకు నటు దోపడయ్యె.

గాలి కెరటములపైబడి - లీల మెయిన్ వినవచ్చెను
మేలిపాట యుండుండి.

ఆచితి నే విహృతి నడ - జూచితి నే జనులన్ బడ
వూచిలాగు కట్టిండును - పాడుట లేదొక పాటయు
నున్నస్సనియనెగాని.

గాలి కెరటములపైబడి - లీల మెయిన్ వినవచ్చెను
మేలి పాట యుండుండి.

సొగదనముగల పచ్చని - పొగకుచ్చు వెన్నాడగ,
బోకనేతగల కాసె - కొక నడుము బిగి గూడగ
గొంతుకూకుడుం డెవడో - నంతదారి నందేళ
వింత నాగసర మూదిన-మంతన గానామృతమా ? కాదు—

గాలి కెరటములపైబడి - లీల మెయిన్ వినవచ్చెను
మేలిపాట యుండుండి.

నిశ్శబ్దమై యా రీతిన్ - నినదమీనె నాడల్లెద !
అతి మధురంబై దోచెను - శ్రుతి మనోహరత వీచెను.

గాలి కెరటములపై మధు-లీల మెయిన్ వినవచ్చెను
మేలి పాట యుండుండి.

## సంప్రశ్నము

" మిన్ను మున్ను తనకు దాను - పొలవాన గురియుగాను
పాలమీద బవ్వళింప బాలుడైతివా ?
బాలుడీవు మట్టిబుట్ట - పట్టరాని కూరిమిని
చన్ను చేపికొనుచు బృధివి నిన్ను గొల్చెనా ?
యేది యెట్టులైన దగవు లేదుగాని ముద్దుబిడ్డ
పాలకూను నీకు నడుమ వటాపత్ర మేమిరా ?
రాలుటాక ? లేక యదీ రంగుచిగుర ? హెరా !"
" నేను వెల్లకితలబండి - మేనుమఱచి నిదురబోదు
బుడుతచేష్ట గుడుచుకొంచు బోటా(వేలినీ !
పాలెకలవొ, పాలమీద-వటాపత్రముకలదొ ప్రశ్నమెవరికీ ?
వటాపత్రమ యది తొగరు
పల్లవంబొ పండుటాకొ తెల్ల మెవరికీ ?"

## తపాలపఱగు

ఉత్తరాలా సంచి నెత్తిపెట్టుకవచ్చు
కూలివానీచేతి సూదిబల్లెపుటులివు
మాఱు(మోయానేల నాదు నెదలో ?

దారి గలసినవాని పరుగులో నా నడక
తారుమారై త్వరన్ దలపనేల ?

ఉత్తరాలా బరువు నొప్పజెప్పటలేందె
తత్తరింపగనేటి కూర్పుతిత్తి ?

చిత్రమీ జీవనము ! చిన్ని యుత్తరమేదొ
యెవరికేన్ గొనిపోవునేమొ ? యేమొ ?

# కాంతి

ఆ కాంతి యేమిటని యనుకోండి మీరు!
ఆ కాంతినే వంట నవ్వారు సాగింత్రు,
ఆ కాంతినే యన్న మారగింతురువారు,
ఆ కాంతినే యూసు లాడుకొందురువారు,
ఆ కాంతినే చలి కాచుకొందురువారు,
ఆ కాంతి యేమిటని యనుకోండి మీరు!

అది-దారినేరినమట్ట-దారినేరినకంప-దారినేరినయాకు-
లన్నింటి గలిపి యొక గొయ్యి త్రవ్విన ప్రొయ్యి
నిడుకొంచు నంటింప దేదీప్యమానమై
భగ్గు భగ్గునమండు మాణిక్యపుంగాంతి
ఏమిటని యనుకోండి ఆ కాంతి నా కాంతి!

దానిముందఱ-వారి తనువులొక నునుశోభ
దానిచూపున-వారిమనసులొక నవభావ
మూనునవి--యూనునవి--
ఏమిటని యనుకోండి ఆ కాంతి నా కాంతి!

త్రోనకనిచెప్పి డిగిన నిరుపేదలది
కడచెఱువు నీటిపై, కడచెట్టుమొదటిపై
నాడి యాడి యాఱు నాపాటిదాకాంతి
ఆ కాంతి నా కాంతి!

అయినప్పటికి దాని యనువుచను వూహింప
చంద్రసూర్యులపోల్కి సర్వసామాన్యంబు
దారిపోయెడు కాపుగారి కిప్పేడు నిప్పు
జాఱిపోయెడుచూపు సవరించు మునిమాపు
ఏమిటని యనుకోండి ఆ కాంతి నా కాంతి!

## మృగశిర

అది జిగ్గు చుక్కంచు ననుకొంటి ననుకొంటి
అర్ధరాత్రిని, అన్నిచుక్క లా చుక్కయై
క్రొమ్మినుకు కాంతితో గొఱలునని యాశిస్తి!

మృగశిరా ప్రవేశమనిచెప్పి జ్యోతిష్కు
లెఱుక నాడినయంత సొగసించు ననుకొంటి
చూపులో రూపించి, ఏది? లేదెచుక్క!
మినుకు మినుకనబోదె! రూపమది తోపదే!

కాళమేఘము ఘటిక ఘటిక కగపడి మెఱసె,
మెఱసినంతన నుఱిమి వాన చల్లన గురిసె,
అరు బయటను నిద్ర నే మఱచి యుండంగ
వానచల్లనగురిసె అదియేనమృగశిర? అదియేన? అదియేన?

## రంగురంగుల పూలు

రంగు రంగుల పూలు - రాగిల్లు పత్రాలు
పేదవాళ్ళు తెచ్చేరు - భాగ్యవంతులు కొనేరు
వినాయక చవితినాడు - విగ్రహాన్ని నిలిపేరు
ఏంటీ పువ్వులంటే - మాచెర్లోవంటారు బీదవాళ్ళు
ఏంటీ ఆకులంటే - మా అడివిలోవంటారు బీదవాళ్ళు
ఎందుకివి అన్నిఅంటే-దేవునిపూజకంటారు భాగ్యవంతులు
కళ్ళల్లొకావలసినంతనవ్వు-కనబడుతూవుంటుం దమ్మినవాళ్లకు
కుండనిండఉడుకుతుంటవి-కుడుములుకుతకుతకొన్నవాళ్లకు
పేదవాళ్ళు తెస్తారు సాధు పుష్పాల్లారా! మిమ్ము
భాగ్యవంతులు కొంటారు పరిమళ పుష్పాల్లారా! మిమ్ము
పుష్పాల్లారా! మీరు పేదలా? భాగ్యవంతులా?"
మేం దేవతా పుష్పాలం! పేదలంగాం! భాగ్యవంతులంగాం!

# నక్కా సామిగాడు

నక్కా సామిగాడు - వాడొక మాలవాడు ;
రాజుగారి కంవతంలో పాలేరువాడు ;
వాడుపోయాడు - ఎంతకాలమైందో ఆ
పోయి ? - వానిని గుఱించి - మంచి
యజమాని తలపోసికొంటూ - చెబుతూవుంటే
దెందులూరి కాడాక్కుండా వెళ్ళిన మెయిల్నీ
ఆగిన మా ప్యాసెంజరు రయిల్నీ
రెండింటినీ గూడా మఱచి స్థాయి—
ఆ కథలో లీనమై పొయినాం-ఆ కాడే యుండిపోయినాం
రేయి—కథలో ఏమీలేదు-కభుర్లల్లో ఏమీలేదు
జ్ఞాపకం రావడంలోవుంది - ఓయీ - వాడు
ఆ స్వామిగాడన్నవాడు - బండి కట్టడమొస్తే
కొట్టేవాడుగాడు - ఏ యెడ్లునన్నా
కాడిమీదోదెబ్బ - కమిచీతొవేస్తే
ఆ యెడ్లు తమంతటవి - మోకరించి మోకరించి
యొక మాఱుగా మెడలుపైకి - ఎత్తుకోవాలి
ఉవ్వెత్తుగాబండి—మొండి - వాడున్నాడే
ఆ స్వామిగాడు ఉత్తశిఖండి—
అలా యజమాని అంటూంటే - వినేవాళ్ళల్లో ఒకరు
“ అవునండి రాజుగారు !-నేనూ ఎఱుగుదునువాణ్ని
మీ పెద్దెడ్లనూ ఎఱుగుదును-అవి వాడి చేతిలో నలగమట్టి
అలానేర్పుగా - అలాతీర్పుగా - అలాచేర్పుగా-వుండేవి
ముందువాడెడుతూవుంటే - వెనకాల బుజ్జొంచుకు
కఱుగూ బెఱుగూ లేకుండా - ఎంతబరువైనా
లాక్కుపోవడమేగాని - రస్తాతప్పడమంటూవుందా ?

మహామంచివాడువాడు!-గుఱ్ఱాలకు నకుడెల్లాంటివాడో
ఎడ్లకివా డల్లాంటివాడు" - అని హెచ్చరిగ్గా అన్నారు
రాజుగారి కళ్ళమ్మట - బొటబొట కారాయి కన్నీళ్ళు.
" ఆ యెడ్లూపోయాయిప్పుడు - వాడూపోయాడు "
అంటూ రాజుగారు నిట్టూర్పు - ఓ జామన్నటుగావిడిచారు.
అంతా ఓ నిమిషం! రైలు కదిలింది!

## ఓ చిన్ని! ఓ చిన్ని!

ఓ చిన్ని! ఓ చిన్ని! - నివు చెంగలిగడ్డికోసి
నీ చెంగునిండదూసి - యే దొంగమోపాకట్టి
లేదూడముందుబెట్టి - కట్టువడపలూడ్చి
గుంట్రడసుట్టుకొంటు - బాబుడబ్బులంటు
దొడ్డిగుమ్మంకాడ - దొరలబిలుసుకుంటు
బారిపోయే అల్ల - పోతరాజుతోటి ఆ
పాతయూసులేంటె? - మీ తోటలోకి రేపు
నా నొస్తె నాకు-ఏంటి - పోతరాజుగారూ!
అంటు లేతనవ్వుల - నతనివొంకసూస్తూ
పెద్దొరలుపి లేచియిచ్చే - డబు వగవగల్ వినవ్వు
నిన్నుప్పుపాతరేసి - యూరుగాయ పెడుతా
నంటు యాత డంటే
ఊరుగాయ! అబ్బో! - అవకాయె? ఇంకేం!
పోతరాజుగారూ! - మావికాయలేన?
మామట్టుకుంటె శాన - నే తప్పుకొస్తునందు
నీ-చెవుల పోగులసందు - పెట్టుకున్నపచ్చ
పువులుజారగనవు - ఓ చిన్ని! ఓ చిన్ని!

## మొదలు

ఒకటి రెన్నాళ్ళతో - వచ్చింది కాదోసి
ఎన్నాళ్ళదీయన్న - ఎంచేది లేదోసి
ఈవేళ రేపట్లొ - ఎడగల్ల బోదోసి
ఉన్నన్నాళ్ళూకూడా - ఉండేదె యిదియోసి.

ఆ నాడు నీ వింత - క్రొత్తకుండను సంత
నడిర్రేలి కబుపుతో - నాబొమ్మ సేయుచో
కర్ర నేనునుగూడ - కదలనేరక నిలువ
కుడికంట కుండను - ఎడమకంటను నన్ను
దారినేచూచి తా - తడవుదానికి మొదలొ ?

ఆ తడవు కాకున్న - పచ్చముదుకకోక
అచ్చంపు బెట్టంచు - చెట్టుక్రింద మెఱయ
అట్లతద్ది పగలు - ఉయ్యాల నీవెక్క
ఉయ్యాలక్రింద నీ - యెఱకలేక యత్రాట
నెగసియూపితి ; బుఱ్ఱ - వంచి నగితివల్ల
వడుపుదానికి మొదలొ ?

ఆ వడుపు కాకున్న - కాకున్న కాకున్న
చేరి ఆ పెళ్ళిలొ - చేసిన బాసేమొ ?

అదికూడ కాకున్న - ఈ పూట ఇచ్చోట
మాపటీల చంద - మామ వెన్నెలచేపు
పాపట నారుచో - నీ చూపు సిగ్గుల
తేపలే మొదలనుకో !

## విగ్రహము

మనసా ! నిన్నాపితి - మలుసంజ దాకెట్లు
అపలే నీ పైని - చూపలేను తాల్మి—
తెలి తెలి సుక్కట్టై - తెలివెక్కి పొలిమేర
పుంతాపై మగరాయి - దాపె నా తళుకూనె—

నెలవంక వంపూలో - వలయమ్ము నలుపెక్కి
కలలోని తలపల్లె - నిలుపూనె త్రాటిపై—
అబ్బబ్బ! అబ్బమ్మ - అందాక ఒక మచ్చ
అగపించి అగపించి - తబ్బాటుగామారె—
నీలంపు టాకసము - గాలిలేనట్టుండి
కడగడ్డిమేటీని - గతికపోచాడించు—
నా యూర్పు నే మఱచి - నా యూహ నే నడచి
పవలెల్ల యీ దాక - పరులాలకింపంగ
పాడీన నాపాట - పరుడెవ్వడో యిపుడు
హరియించి నన్నాట - లూరించుచున్నాడు—
మనసా! నిన్నాప్రీతి - మలుసంజ దాకెట్లొ!
అపలే నీ పైని - చూపలేను తాల్మి—

## చిన్నప్పుడు

"దీనిని నివు చిన్నప్పుడు బో బో బో అన్నావు."
"ఈ కోడిపుంజునా? అమ్మా!"
"దీనిని నివు చిన్నప్పుడు కా కా కా అన్నావు."
"ఈ బొంతకాకినా? అమ్మా!"
"దీనిని నివు చిన్నప్పుడు పుస్ పుస్ పుస్ అన్నావు."
"ఈ గండు పిల్లినా ? అమ్మా!"
"ఊఁ."
"అమ్మా! మఱి నిన్నో - నే నేమన్నాన్ చిన్నప్పుడు ?"
"అమ్మే అని అన్నావుర!"
"అమ్మా మఱి బువ్వే' యని, 'అమ్మా! మఱ బొబ్బె' యని యన్నానట కాదే!"
"ఈ పేదరాలినా? బిడ్డా!"

## బ్రహ్మసృష్టి

చేసినపుడేతొల్త - చేసినా డబ్బమ్మ
చక్కన్ని వారిలో - నెంతొ చక్కగ నిన్ను !—
చేతలోనే నీకు - నాకు సఖ్యం గూర్చి
ముఖ్యంగ ముమ్మారు - మూడుముళ్ళేయించి
పైపైని దూముడినె - పసుపు బూయించాడు—
బ్రొమొక్కించినాడల్ల - ముక్కోటి వేల్పులకు :
కళ్ళురెండెట్టాడు - కడకంట నే చూడ ;
కంఠమొకటిచ్చాడు - కమ్మంగ ఊసాడ ;
పుల్కు పుల్కునబూచి - పల్కు కొమ్మా !
కులుకు మోవీతేనె - లొలుకనిమ్మా !
వెలది ! చెవులుంచాడు - వింటువిన్నట్టుండ,
నెన్నొసట వ్రాసేడు - వన్నె చిన్నెలెన్నొ,
ఒక్క ముద్దూపుట్టి - చక్కపొమ్మా !
ఎక్కడున్నాప్రేమ - లెక్కగొనుమా !
పూలదండలవంటి - కైదండలిచ్చాడు ;
బిగియారు కౌగింటి - జిగితెగని సొగసులవి ;
రేలనింతకు నిదుర - తేలగొట్టేసేడు !
ఏలంటె నీవంటిదే - లేదనంటాడు.

## అంబ

అంబరము క్రిందూరకే - సంబరము కొలదినాడే
లంబాడి చిన్నవానిన్ - అంబేది చూపుమంటిన్.
తమ్మి పువు సంగడీనో - కమ్మనగు పైరుగాలో
ఉయ్యాలూచేటి కొమ్మో - కొయ్యేదలచేటిపండో
చూపించు ననెడు వింతన్ - కాని వాడొక్క స్త్రీనిన్

ఆ నడుమ బొలములోనన్ - మానితంబైన నడకన్
గానిపించేటి దానిన్ - అంబ యని వేగ జూపెన్.
ఆమెకడ కేగె వడిమై - ముద్దులిడె నాపె వానిన్
సూర్యచంద్రులమించి సొబగై-గాలి చెట్టులమించి చలువై.

## ఆ నా డూ

ఆ పడవ నెప్పుడొక - డతి వృద్ధుడగువాడు
అట్టిట్టు నడిపించు.
నాడు చిన్నపిల్లం డొకడు - కన్నెపిల్లా లిర్వు
రెక్కి నడిపించువారాపడవ.
కన్నెపిల్లల జడల - గనిపించె గన్నేరు పూ
లిన్ని గ్రుచ్చుకొ నెఱ్ఱజిగుల ;
చిన్నిపిల్లనిమోము - చిరునవ్వు నవ్వుచవె
పువ్వునా మురిపించె గలిమిమిగుల.
గడనెత్తి పిల్లండు - పడద్రోసె బడవేట
పడిపోదుమన్నారు బాలికలు.
పకపకా నగె బాలు - న కుటిలపు బలుచాలు
చికిలి కన్నులు చిట్టి తారకలు.
ముసలివా డప్పుడే - యొడ్డుపై కరుదెంచి
పడవ పాడయి పోవుననుచు నఱచె.
ఫరవలేదనిచెప్పి - బాలికలు బాలకుని
త్రోయమనిరీ, పడవ త్రోయమనిరి.
ముసలివానిమోము - ముణుచుకొని పోయింది
ఉసురులయి దాను చేత నుంచుకొనియె
పిల్ల లార్చి పేర్చి - పెర తీరమునుగనిరి
పరుగు పరుగున జనిరి పల్లెవంక.

## వెంకడి పెళ్లాం లచ్చిందేవి

" వెంకడి పెళ్ళాం లచ్చిందేవి ! - వంకర నడకేమే ?"
" కొంకిలువిఱిగాయి కిటమ్మగారు !-కుంటుతువున్నాను. "
" అయితేనండి కిటమ్మగారు ! - అక్కడ వుండుండి. "
అంటూ కుంటుతు "అమ్మీ! లేయని" - తనముందఅదాని
ఒక్కాత్రోపూముందుకుత్రోసి - ఒకాక్కపఱుగూతానుపుచ్చక
ఎగిరీపోయింది!-వెంకడిపెళ్ళాంలచ్చిందేవి-ఎగిరీపోయింది!
కాలువయీవల కిటమ్మదాని - వెంటాసూస్తాడు
ఓలే అంటూ పిలవాబోతా - దూరుకుంటాడు
కాలువలోని తురాయిరేకు - తెప్పా కట్టుకొని
అలా ఆవలి యొడ్డుకుదాట - ఆలోచిస్తాడు
ఆలోచిస్తా డంతేకాని - ఆవల అదివీది ?

## నీడలు - ఆత్మలు

వీధమ్మటను - వెన్నెట్లోను
ముగ్గురు యువతులు - కడవ లెత్తుకుని
నడుస్తూపాడే-దుడుకుపాటచే ఒడుదుడు కెవరికి ?
వారికిగాదు - వారికె అయితే
కడవలెపగులు - పగిలిన కడవల
గాలేమిగులదు - నీళ్ళేంమిగులు ?
వారినీడలే - వారిదేహములు
వారిదేహములె - వారినీడలు !
అంత నల్లనగు - నొడళ్ళు వారివి
వారిగొంతులే - వారిఆత్మలు !
వారిఆత్మలే - వారిగొంతులు !
ఆత్మలన్నియు - నొక్కటికాగా
అల్లపాట - నా సొంతంబైనది.

## నా సొంతం - నా సొంతం

నీళ్ళల్లో బాతుల్లు - నీటంచే అనటుల్లు
అనటుల్లో పూరిల్లు - నా సొంతం! నా సొంతం!
నాకవి చనువైనవి - నే నెన్నడు నవ్వాని నిదమి,
కాళ్ళు కడ్డాలడి - కళ్ళల్లో మెదలుతవవి.
సంఘంలో సద్బ్రాహ్మణు - స్వచ్ఛపు జందెము కంటెన్
అచ్ఛపు దెలియా బాతుది - అయినన్ దాకెడునది
నాపై దానికి ప్రేమ - దానిని నే బ్రేమింతును.
అనటీచెటు నాచేతను - నీరానును వెలివేయదు,
పూరిల్లో ఆతిథ్యము - నాకిచ్చును సాయంత్రము.
నే నొక నిరుపేదను - వెలివాడను బుట్టితి నయితేం?
నా చేతను బూయించిన - ఏ చామంతియు బంతియు
మూ చూడగ జడముడువగ - ముచ్చటయగు నెవ్వాడను.
నా వర్షపు నారాయడు - నన్నెంతో మన్నించెడు
మనసున్నది మఱి మఱి - నా యిల్లతనిల్లొకటే
నా సొంతము - నా సొంతము.

## మువ్వ మెళ్ళో

మువ్వ మెళ్ళో కట్టి విడిచిన - తువ్వవెనకాలున్న కృష్ణా!
నవ్వవోయి నాకేసిచూచీ - పువ్వులిస్తున్నా!
జుంయి జుంయని పాలుపిదికే - ఆ యశోదను నాను కృష్ణా!
ఆడవోయి నా కంటిపాపలో - నీడ మోస్తున్నా!
"పెఱుగు పెఱు" గని వీథినఱచే-వెలది చట్టిని వెలుచుకృష్ణా!
నింపవోయి నా నిండుకొను హృది - మురళి దెస్తున్నా!
ప్రేమకోసం పెనగులాడే - రాధరూపం బెయిదుకృష్ణా!
నిలవవోయి నా పరుగుపందెం - గెలువు వస్తున్నా!

## మొగలి పొట్ట

కట్టెలుకొట్టుక యమ్ముకొనెడు నొక - కష్టజీవి తనదూ
కట్టెల మోపున మొగలిపొట్టనిడి - చుట్టుగనుచు నడచు
కట్టెల మోపుం గావాలాయని - గట్టిగ నత డఱచు
మొగలి పువ్వు కొనుక్కోరాయని వా - డొక్కరి నడుగడుగ
ఎండిపోయిన పేరుపు పేడుల - నిండు పరిమళముతో
ఆకుపచ్చపైరేకుల లోలో - పసుపుపచ్చ నెఱిచాయన్
ఆ యుభయంబునె కోసినదోయన - నతిసుందరమగుచున్
అంగడి నిటునటు నడచెడువారిని-నాకర్షించుచునదియొప్పెన్
మోడగుమాకును గొడ్డటగొట్టు - వాడెటు గొనివచ్చె
పోడిమిగల యా మొగలి పువ్వనని - నా డెందముమెచ్చె.

## ఈ కొండ - ఈ యెండ

ఈ కొండ ఈ యెండ, ఈ పెద్ద బాడువలో
చూపట్టుచెట్టు నీ డెవ్వనికి ? ఎవ్వనికి ?
గోచిపెట్టుకున్న గోపడికి గోపడికి
గూటిబిళ్ళాడేటి పాపడికి పాపడికి.
ఈ చెరువు ఈ దోనె ఈ గట్టుపైకెక్క
వీచునట్టిగాలి యెవ్వనికి ? ఎవ్వనికి ?
ఈ తాలాడునట్టి యెల్లడికి పుల్లడికి
ఈలకొట్టే చూచు ఈరడికి పేరడికి.
ఈ చిట్టి వెన్నెలల నీదారి పోతూంటే
వినరు పూ వోసనలు ఎవ్వనికి ? ఎవ్వనికి ?
గొడ్లు మళ్లేధూళి గుడ్డి పాలేరునకు
కూటి గుడ్డ వ్యఱచు కవికుమారునకు.

## చాన చలువ

పైనదిరుగు మేఘము - ప్రక్కనుండి నడచెరా !
మేఘమదియు కాదురా ! - మెలత నల్లకచమురా !
కనులనొఱసి దరిసెరా ! - మింటిమెరపు వరుసరా !
మింటిమెరపు గాదురా ! - మెలతమేని సొగసురా !
వానకాల మంతకూ చానచలువ చాలురా !
ఏరువలదు పైరువలదు పేరుపెట్టి పిలువరా !
వానకాలమందు నడుచు చానకేమి నిలుపురా ?
గాలిమేఘ మొకటి చన్న దేలుమేఘ మన్యము.
వానకాలమందు మసలు వనితలంతె వింతలు !
మనికి, యునికి, వినికి తలప కలికి సుంత నిలువదు !
" ఎవరువారు ? ఎవరువారు ?"
" ఎవరులేరు శ్రావణం - బెఱుకకు నిడుచెలువను. "

## తాదాత్మ్యము

వయ సొక్కటేనా నీ సొంతసొమ్ము ?
వయసుతో కూడా రహస్య నీదేనా ?
నీ వరద చూస్తూ మహొాద్రిక్తుండ నైనాను ;
నా జరాభార మంతర్హితంబయ్యె.
ఏరే నెవర్తెతో నెక్కడున్నానొ ?
ఓ రాత్రి కథకాదు ; ఓ రాధ కాదు.
గట్ల కౌగిలిమధ్య చెట్లు లేవెందు ;
గుబురు గుబగుబ లేడ గుండె తప్పిస్తే ?
సూర్యాతపము శుద్ధ శూన్యమై చన్న,
కార్యావసరముకొద్ది గతి తప్పనైతి.

చీకటులు నాతోడి చెలిమి గన్నపుడు
ఆకారమే మఱచి అడిగాను దారి.

కాలు సాగుటలోనె గాలి వీచింది ;
గాలిలో కబు రాస క్రమ్ముకొన్నాది.

వయసొక్కటే అయితె ఏ యేటి యుబుకొ ?
వయసుతో కూడా రహస్య నాకుంది
ఈ యేటి యుబుకేను ! నీ తోటిదేను
నీ కొత్త నీటితో నృత్యమాడేను.

## బొమ్మల వోలలాడింపు

నూనేరాచేము, నున్నగ గురులను మన్నన దువ్వేము ;
సిగలేచుట్టేము, సిగలను సొగసుగ చేమంతి చెరివేము ;
నగలే తాల్చేము, ధగధగ తళతళ నగవే నవ్వేము ;
బగ్గుండ చల్లేము, ఊరేగుచు చీరాడగ సాగేము ;
వగలే పోయేము, వగవక బొమ్మల వాల్లాడించేము ;
మాయగజూచేము, సాయంసంధ్యలొ సన్నగ దలచేము ;

కుమ్మరిసారె బమ్మెరసుతగా
బొమ్మల గొలిచిన తొమ్మిదిరేల
ముమ్మరమైన కమ్మని కలలు
ఇమ్మహి నెప్పటికైనా తగులు !

ఉండవె కొమ్మా ! ఆగవె భామా !
రా ! ముద్దుగుమ్మా ! ఓ ! వన్నెలాడీ !
ఓయారి ! నారీ ! ఒప్పులకుప్పా !
వెన్నముద్దా ! వెన్నెలముల్లీ !
వెళ్ళిపోకె !... ...నూనే రాచేము !

## ఐక్యత

కలిసిపోనీయ్ - నా పాట నీ పాట
కలిసిపోనీయ్! నాకు గొప్పొవద్దు
నీకు మెప్పూవద్దు; కలిసిపోనీయ్;
నా పాట నీ పాట - కలిసిపోనీయ్.

ఎత్తుతున్నా గొంతు - చిత్తంలొ ఇరికిరికి
వత్తునా వెలికంచు - కత్తిరిలునూహ;
కలిసిపోనీయ్ - నా పాట నీ పాట;
కలిసిపోనీయ్! - కలిసిపోనీయ్!

ఏదోయి నీ పాట? ఏది దారీతెన్ను?
ఎందు వినిపిస్తోంది? ఎందు నిలకడ దేవ?
రాదోయి! రాదోయి! - నా పాట యీవలకు;
కలిసిపోయిందిటోయ్! కమ్మన్నిపాట!
వెలిసి విరిసిందిటోయ్! విలువైనపాట!

## అనుభవము

నే ననుభవించి వేస్తున్నా!

లోకంలో సౌందర్యం - లోకంలో ఆనందం
లోకంలో గానరసం ...నే ననుభ

నన్నెవరు చూడకుండాలి - నన్నెవరు నవ్వకుండాలి
నన్నెవరు అడుగకుండాలి అంతే! ...నే ననుభ

నామణికట్టుల గుంఁద్రదనం-నీభుజపంజరపుంబుష్టి
నాదనీద యన్నట్టుగ ...నే ననుభ

నా మనసులోనిమాట - నీ మాటలోని మనసు
నాదనీద యనుగుట్టుగ ...నే ననుభ

నాయూర్పుచివరియీాల - నీయీాలచివరియూర్పు
నాదనీదయను మట్టుగ ...నే ననుభ

## అనుసరణము

ప్రియుడేమో పాడ్తుంటే - నేనేమో వ్రాస్తున్నా
రాగం నే దీస్తున్నా - గాలిలో తేస్తున్నా
చేతుల్తో తోస్తున్నా - అభినయిం చేస్తున్నా.
నా-గాజులు గలగల హొయనే - మట్టెల్ టకుటికులయనే
ముద్దుల్ సుద్దుల్ దయనే - ప్రియుడేమొ పాడ్తుంటే
వద్దనువా రున్నారా ? - హద్దిడువా రున్నారా ?
సద్దనువా రున్నారా ?
చుట్టూను నిశ్శబ్దం ! - నిశ్శబ్దం అదియేది ?
గాజుల్ గలగలవాని - పాటానె మాయంగా,
పాటంగల కలరుతము - మట్టెల్ టకుటికుడాచ,
ముద్దుల్ సుద్దుల్ వాని - మోముపై మూగలుగా
అదియే ఆ నిశ్శబ్దం !

## ఆత్మావలోకనము

నే ననుకొంటూ వ్రాస్తున్నా - వ్రాస్తూ నే ననుకొన్నా
కలంచివర కాస్త సిరా - చేర్చుకొక్కె యాగిపోవు ;
ఎదియో కింపురుషాంగన - ఎదియో కిన్నెరకన్నియ
ఎదియో గంధర్వస్త్రీ - ఎదియో యచ్చరలేమ
అక్షరముల నన్నీ తన - పక్షంబుల జెరిచివైచి
యక్షయమగు కీరితి తా - తక్షణమే దాపినట్లు—

నే ననుకొంటూ వ్రాస్తున్నా - వ్రాస్తూ నే ననుకొన్నా
కలంచివర కాస్తసిరా - బుడబుడ పొర్లెత్తినదై
యమునారుచి గంగగలియు ;-నెదియో తియ్యపుటూహ
యెదియో నెయ్యపుజెయ్యి - ఎదియో తీరనికోరిక

ఎదియో చేరనిపారం - వచ్చే వచ్చే ధారన్
భావంబుల దరిమివైచి - కన్నీరము గార్చినట్లు ;
అనవాలునకు నేని - యందుబింబ మరయరాదు—

నే ననుకుంటూ వ్రాస్తున్నా - వ్రాస్తూ నే ననుకొన్నా
కలంచివర కాస్తసిరా - త్రుళ్ళించింది పరువుళ్లై
చీకటికమ్మిన చాయగు ; - ఎదియో యార్ద్రస్మరణ
యెదియో గాఢస్పృహణ - యెదియో రాగసుదీప్తి
యెదియో నిత్యసుషుప్తి - నా తొందర తొందరచేతిన్
నీ తోడని మానిపించి - చెడిపోయిన కాగితమును
చింపనియదు, చింపనియదు—

ఈ వి

" నా పాట మల్లెపువ్వు - నాపాట మంచిగంధం "
పల్లవి తియ్యంటే - పల్లపంతె యందు.
" నా పాట మించుబోణి - నా పాట నీలవేణి "
అనుపల్లవేదియంటే - అదె వల్లెవేయమందు.
" నా పాట సుధలజిమ్ము - నా పాట సూక్తికిమ్ము "
చరణములెవి యంటే - ఒకటె ముగిసెనందు.
" నా పాట యెవరికోయి - నా పాట యెవరికోయి "
ఏది మఱల అంటే - అనగనగా—తనుగా
అతనిమూర్తి విందు - అతనిపూర్తినందు.

" నా పాట మల్లెపువ్వు - నా పాట మంచిగంధం
నా పాట మించుబోణి - నా పాట నీలవేణి
నా పాట సుధలజిమ్ము - నా పాట సూక్తికిమ్ము
నా పాట యెవరికోయి ? - నా పాట యెవరికోయి "?

## కీర్తి

మెత్తని పచ్చికపైని - నడతును నా నడకనినద
మొరులువినని మచ్చు—
ఆ పచ్చికపువ్వులు పూయ - నాగిపోదు అడుగుపడదు ;
కనులు మూసికొని నడతు - పరులు రానిమచ్చు ;—
ఆ పూలను దేటులు మ్రోగ - అదలిపోదు ! అడుగుపడదు ;
చెవులు మూసికొని నడతు - నేదిగాని మచ్చు ;—

నన్ను దలతువేమో - మూగవానిగాను !
గ్రుడ్డివానిగాను - చెవిటివానిగాను !
తెలిసికొందు వెంటన్
పచ్చిక నడగురుతు - గురుతునె పూల్విడుట
ఆ పూల షట్పదముల - లేపి నేను జనుట.

## అవిరళత

కూర్చున్న పాటొస్తే - నించున్న పాటొస్తే
నడుస్తున్న పాటొస్తే - నేనేమి చేసేది ?
నిశ్శబ్దంగా - నిశ్శబ్దంగా
పాటమ్మా రాకమ్మా ! పాటమ్మా వద్దమ్మా !
పాటమ్మా మానమ్మా ! అంటూను, వింటాను.
పాడేది యెవరంటే - "నీవేను నీ హృదయం
నీవేను నీ మనసు - నీవేను నీ వాక్కు !"
అంటూంటే ఏమంటా ?
నడుమూగట్టి నేను - నాట్యంబు గావిస్తు,
నాట్యంబు నాదంబు - నాదంబు నాట్యంబు
తందాన తానన్న - చందాన సాగిస్తా ;
అంతా నిశ్శబ్దంగా - అంత నాలో నేనే !

## ఊహ

నా మొదలియూహ యెల్లప్పుడు
నలువసృజన నయనయుగళి - గనుగొని యా క్రమరూప
ముల నూరక యర్చించుచు - హృదయసీమ నేమివినను.
నాపిదప యూహ యా క్రియనిటు-పాటపాడిచాటుటమహి
పాటమాని మున్నుగన్న - ప్రప్రథమ ప్రతిభకొఱకు
పాకులాడ వ్యర్థమహో! - పాడుచేసుకొంటి వరర
హాస్యాలోకన తన్మయసుఖ! - మనుకొందున యక్షిమూసి
వినబడునెదొ వింతగాను - కనబడునెదొ ఘనముగాను.
సృజనసేసినట్టి స్రష్టె - వల్లెవేయు వేదగోష్టి.

## ప్రజ్ఞ

నాకూ రానిరాగ - మెవరైనా తీస్తుంటే
కనుబొమలు త్రిప్పేస్తు - ననుమఱచి యూహిస్తు
తలనాడిస్తు ముందు—
నాకూవచ్చిన రాగ - మెవరైన తీస్తుంటే
వాగేస్తా వానీతొ - ఆగేస్తా వానీతొ—
నీ వొక్కడవే పాడు - ఏదైనాయని యంటే
నాకూ నెవరికిరాని - దానికై యోజిస్తా
బాగుంది యనుదాక - ప్రజలెల్ల చనుదాక—

## తృప్తి

ఊహించే మనసోటి - ఉంటేను చాలన్నా!
దేహంబు వద్దన్నా!
రోగాల పుట్టద్ది - రాగాల తట్టద్ది—
మోహంబు పెంచన్న - దాహమెక్కించన్న
ఊహించే మనసోటి - ఉంటేను చాలన్నా!

మోహించే పిల్లొకతె - ముందుంటే చాలన్నా!
ముద్దిడితే చాలన్నా! - ముట్టొద్దు నన్నన్నా!
కౌగిలి చాలన్నా! - తాకొద్దులే అన్నా!
కనుగీటు చాలన్నా! - కనబడకుంటేమన్నా!

## సున్నితము

నవనవలాడే తీగెలకంటె
నవనవలాడే హృదయంనాది
తీగెలు పువ్వులు పూసేస్తాయి
" ఎండకు బువ్వులు వాడేస్తాయి "
అనేటి భయమూ లేకుండా లే
దీగెలు పువ్వులు పూసేస్తాయి.

రెపరెపవీచే గాలినిమించు
విడుమరగలదీ నాదగుపాట;
గాలులు మబ్బుల మోసేస్తాయి
" కొండల మబ్బులు వాలేస్తాయి "
అనేటిభయమూ లేకుండా తొలి
గాలులు మబ్బుల మోసేస్తాయి.

ఘనీభవించెడు నీళ్ళకులేని
మనోహర స్ఫటికాచ్ఛత గలది
నాదగునూహ నాదగునూహ;
వీరూరక హిమశకలముద్రోయు
" తాకుడుకాకకు నదిసెడి కరగు "
ననేటి భయమూ లేకుండా నది
నే నూరక హిమశకలముద్రోయు.

నా హృదయం విప్పను— విప్పను— విప్పను,
నాదగుపాట మఱొకచో నాపను,
నాదగునూహ గ్రహిస్తే యొప్పను.

## యాచ్ఞ

పువ్వులు ముగ్ధము లౌట - పొలతి! నిన్ను బలుకరిస్తి;
ముగ్ధగ నీవూనుంటే - దగ్ధముగా నా హృదయం.

మెఱపులు చంచలమౌట-మెలత! నిన్ను నిలుపుమంటి:
నిలువక నీవూ తలగిన - చీకుగదా నా హృదయం.

చంద్రిక కృష్ణనులేమి - చాననిన్ను నవ్వుమంటి;
చాన! నీవు నానగొన్న - మానుగదా నా హృదయం.

## ఆశ

ఆశాంకూరము దలచిన - నతివినోదకరమోహో!

తరుణీమణి దీర్ఘకేశ - ములు ముఱచిన; ధైర్యముగా!
ఆశాంకురము ముఱుగదు.

అంగన కటాక్ష మాలిక - పెడమలచిన, నవెవలచు;
నాశాంకూరము మఱలదు.

సుందరి నిడుదగు నూరుపు - లోలోనణచిన, విడువదు;
ఆశాంకూరము సుడిగొను.

ఆకులకొనలందు ననదె - పువ్వులరేకుల నయ్యెదె,
పక్షుల రుతముల నయ్యెదె - మేఘాలల్లిక నయ్యెదె,
యాశాంకూరము దలచిన - నతివిషాదకర మయ్యో!

## పరిశీలన

నీవు ముగుదవైయుంటే - నాకోలాభంచూడు!
నీ చెవిలోమాటసెప్పి - నీ హృది బ్రతిరుతిస్తా!
నీవు కోపగిస్తే - నాకో కోపదిచూడు!
ప్రణయ పరమదంటూ - నీ మది నుడికిస్తా.
నీవు బాసియుంటే - నాకోమార్గంచూడు!
ఉత్తరము లిఖించి - నానెత్తురందు సిరా.

## మధురిమ

చెఱుకు విలుతుగ - నలరువిలుతుగ
మన్మథుని ననులో.
చెఱుకు తియ్యము - అలరుమెత్తన
నీదిగాదోచు ; - నిష్ఠురపు ములుకు
అతనిడిగదోచు - కానిచో—
ములుకు నుడుచుకొంటు నీ - తియ్యమెటుతలతు ?
ములుకు తీసికొంటు నీ - మెత్తనెటుతలతు ?

## పరిపూర్ణత

ఓ సుందరి! - నా హృదహము నిండియుంది
సౌహృదభావముతొ - నీ బుజముమీది నీళ్ళబిందె
దించిదీనినెత్తికొనుము.
"నీదగు ప్రేమము పాంథా! - నీరమ్ముల బలె నందఱి
కందీయగ వచ్చునమఱ ?"
"ఓ ! నీదగు సొంతమదిప్పుడు; - ఇంతవఱకు నాదేమో?
ఈ పరిపూర్ణత నీకైయే !

## భయము

కోమలికంతపు దీపి - కోకిలాన కెనయంటే,
వానకారు రా జెలినిం - బెడ బాయుదు నను భీతియ.
కామిని కన్నులుచూచి - కమలదళము లేమొయన,
రాతిరి కన్నులుమూయ-నెవరు కునుకవలె నను వ్యథ.
గఱితమిన్న కౌనరసి - గగనంబని పొగడుదురది ;
ఱెక్కల విప్పుల యెగిరే - నాకు మఱీ ప్రవాసముగద.

## క్షమార్పణము

"నా చెలి వేనలినుండి - వాడిపోవ నూడిపడగ
నిన్ను గోసికొనిపోదు - క్రొన్ననలో! క్షమియించు"

"ఎటులైనను వాడిపోదు-కుసుమగాత్రి కుంతలములు
మెఱసిపడుట భాగ్యముగద"

"నా చెలి హృదయపు గరినత - చిందిపోవ, చిటిలిపోవ
నిన్ను గ్రుచ్చుకొనిపోదు-తెలిముత్తెమ! క్షమియించు"

"ఎటులైనను భంగములే - పయ్యెదలో సయ్యాటల
దెగినవళుల చలువగలదు"

"నా చెలి యధరసుధాప్తిని - గలసిపోవ, కరగిపోవ,
ముద్దుకాన! నిన్నద్దుదు - అమితమైన క్షమియించు"

"ఎటులైనను సమితపుబనె - కలికిదలచి గాలికినను
వదలుచున్నవాడ విపుడు; - అద్దునపుడు గాలికెడపు
రద్దుసేసి రక్తియిడుదొ?"

## భగ్నము

"నీ హృదయస్పందము
విన నిపుడేమిటి కారణ మనుగూ!"
"అది భగ్నంబై
తుత్తినియలు మున్నేయయె"
"వినగనైతిగ తద్భిదము?"
"నీ హృదయము పగిలియుండు
నాడే నాడే నాడే!
ధ్వనిలో ధ్వని గలిసియుండు!"

# అమృతపంథ

వందమంది వారలున్నారు!
వందమంది మోకులాగేరు!
ఒకడుమాత్రమె పదము సెప్పేడు!
బరువుమీద వెన్నెలడుతుంది—లాగే
బరువుమీద నీడలడుతున్నాయి
ఎడప బరువున పాటపాడేడు!—

చుక్కచిన్నది ఓర చూస్తోంది
ఏరురూపసి పార చూస్తోంది
పేగులన్ని ఉగ్గబట్టేడు—తన
పేగులన్ని బిగ్గబట్టేడు
రాగమునకే రంగుమార్చేడు—

తారునునుపే దండగన్నాడు
తనువుజోతే ఉండదన్నాడు
"అదిగొ పట్టైలాస" అంటూ
"ఇదిగొ పట్టైలాస" అంటూ
నేతరాల్తో నెత్తురొంచాడు—

కన్ననాకు దృష్టి చెదిరింది
విన్ననాకు పుష్టితప్పింది
మృత్యువిగ్రహ మమృతపంథ—మృత
మృత్యువిగ్రహ మమృతపంథ
నడుగుసాగిన అలికిడెందంటూ
తనకుదానై తరుముచడిగేడు—

## వైరాగ్యము

మాయగప్పిన జగము వెనుకను
మహత్సత్యం బొక్కడుంటే
అప్పమాయగ మాయు నీకను
చూడ్కిలో నిజమేలయుండదు ?

గేయమాగిన నంతరాళ మ
మేయ ముఖరిత నాదమునమను ;
హృదయతంత్రికి నిర్వ్యరిట్టటు
ఏల భయపడ మూగవడునని ?

మొగులుదొలగిన బొద్దు సూడగ
మొగంవాచిన చొప్పునుందురు ;
మెఱపుదోల దలంపరెవ్వరు ;
మెఱపుచాలై మిహిరుడొదుగడె ?

మోహమొక్కలె కాదు ; మోహం
మీదమెఱసే ప్రేమవలదిక.

## వెన్నెల్లో ఓ రాత్రి ముస్లిం శవం పాతు

"ఏడకు తీసుకువెడుతున్నారీకట్టె ?
ఏడకు మోసుకుపోతున్నారీపెట్టె ?
మేడకు కాదనుకుంటాన్ - ఓడ లేదనుకుంటాన్—"
ముందు సన్నాయిజోళ్ళు - వెనక బూబీలబళ్ళు,
పైగా వెన్నెలరేయి - కింద సీకటిగోయి,
చీకట్లో పాతేస్తాం! - వెన్నెల్తో కప్పేస్తాం!
ధునియామే దొరకడుమళ్ళా-అనుకుంటూ ఇంటికిపోతాం!

ఆ తట్టు గుడిసెగొడవ - యీ తట్టు కొలనుపడవ,
పడమట రస్తానడవ - తూర్పున రైలేతడవ,
మద్దెను గోరీకడతాం ! - మనసుకు శాంతిపెడతాం !

వెన్నెల్నే సిన్నెలు సూస్తాం ! - సీకట్లో యేడుపుదాస్తాం !
కట్టైమమోసిన నేస్తం - పెట్టైతొ మోగినగీతం
ఉత్తినె పోదనుకుంటూ - హల్లాక్ సలాంచెస్తాం ! ! !

## దిక్కులేని ఓ మనిషి శవం

ఐచ్ఛికసేవక భుజస్కంధముల
నిచ్చపరున్నటు పడుకుంది
దిక్కులేని ఓ మనిషి శవంబు !—

తెలియదు పేరు, తెలియదు వూరు
తెలివిగలారు ఉరకగనేరు !
బజారుజనము పరికించేరు !
దరికొత్తిల్లుచు దారిచ్చేరు !—

స్మశానమునకో దర్వాజా అటు
"తెరుపుడు తెరువుడు తెరువుడు" అన్నటు
"హరేరామ హరేరామ, కృష్ణ కృష్ణ హరే హరే"
అంటూ తీసుకు పోతున్నారు
ఐచ్ఛిక సేవకబృంద సోదరులు !—

స్మశానమున తగు జాగాలేనటు
పరుగిడుచున్నారల వాహకులు !—

మధ్య్య మధ్య్య నిశ్శబ్దం గొలుపుతు
మార్చుకునేరు బుజాలవారు !—

"హరేకృష్ణ హరేకృష్ణ హరేరామ హరేరామ"
చైతన్యముగల విడి ప్రపంచమే
మందిరమట అలమనిషికి నిత్తెం!
బ్రతికున్నప్పుడె తలుపెఱుంగడట!
ప్రాణాలున్నా పదవి నహీయట!
తెలియదు పేరు తెలియదు వూరు—

జీవనగానము చేసినచోటు
భావనదీపము పెట్టినతావు
ఎఱిగిన వాడొక్కరుడులేడు;
తెల్లవాఱు సరి కెంచనితీరు
అల్లాతి మనిషిప్రాణాలై దెగిరె;
కాకికి తెలియని ఏకాకితనంగా!—

అనవాలునకు మ్రాకునీడలే!
దోనమాలు వ్రాశాడో లేదో?
ప్రాణాలైదే ప్రపంచమున నేస్
స్థానాలేర్పడి యిక శాసించేనా?—

బ్రతికున్నప్పుడు వానికిపంచ
ప్రాణాలేగా ఆస్తీ పాస్తీ!
నాస్తియె నా యిపుడయ్యవికూడా?
"హరేరామ హరేరామ! రామ రామ హరే హరే
హరేకృష్ణ హరేకృష్ణ! కృష్ణ కృష్ణ హరే హరే!"

## విలువలేని ప్రేమయిాడె?

కొండమీద కెండవచ్చె; - కొలనిపువ్వు కులుకులెచ్చె;
గొడ్లవెనుక గోపకుండు - గోటుగాను పోవుచుండె;
ఉదయమూ! శుభోదయమూ!

ముదముగదుర పక్షులొక్క - చిగిరించిన రావిమీద
కలరవాన మెళుకువూనె; - పక్షులాను జూచినాడు
గొడ్లకాయు గోపకుండు - కక్షనో, మఱి కుక్షికొఱకొ,
అక్షీణస్వేచ్ఛనో— అహో ! ఒడిసెలాను రాయిజొనిపి
వదలినా డొయారంగా !

అదే ముహూర్తమందు, చెంత - గుడిసెనున్న కోయపిల్ల
కొత్త కొత్త కోసిరాసి - బొత్తలొడిచి బూరచేసి,
రాతిరెల్ల వేచివేచి - వేగుబోక నూదినాది
వెల్లడినే పిల్లగ్రోవి.

వెచ్చనెత్తు రోడ్చుకొంచు - గూటిపక్షి కూలెనంత ;
కోయపడుచు వెచ్చయూర్పు - గోపకుచెవి బడియెవింత.

అండనెవ్వ రొరులులేరు - కుండనీళ్ళు తెచ్చుకొనెడు
ఊరి కోమలాంగులున్ను - రారు దారి తేరిచూడ.

“ కొట్టినట్టి పిట్టనిస్తు ! - చిట్టిపిల్ల గ్రోవినిస్తె ?
చిన్నదాన !” అన్నవాడు - గోపకుండు గొడ్లసందె.

“ ఇల్లరా ! పిల్లవాడ !” - అంది పడుచు అడివిఏస ;
గోపకుండు దరికినరిగె.

పిట్టగొనుచు, పిల్లగ్రోవి - వానిచేత పిల్లపెట్టి
“ సంతవిలువ శానాగాని - చక్కగాను వూదుకోర !”
అందిపిల్ల—అసువుబాసె - ఆమెచేత·నల్లపిట్ట !

“ విలువయెఱిగి కోరలేదు ” - అనుచు నూదినాడు బూర
అల్ల గోపకుండు పోక ; - పిల్లగుండె యులివు మారె !
“ వాడుసంధ్య తిరిగిరాడె ?-విలువలేని ప్రేమయీడె ?”

## నిజమైన కూలివాడు

గనిలో అట్టడుగునగల - కఠినపు బాషాణముపై
గునపమేసి, కూలబడెను ; - కూలివాడు కూలబడెను —

ఉలిసెను లోగుండె ! కురిసెను కన్నీరు !
మెఱసిన దెయ్యాదియో ?—

"అబ్బా" అనుకొన్నాడు ! - అతనియూర్పు పెనుమబ్బుగ
నావరించె ఖనిఅంతా !-" ఇఖ చనిపాతే మేలు ;
మేలు, మేలు, మే" లంటూ - పుఖము వ్రేలవేశాడు ;
కూలివాడు, కూలివాడు - సుఖమందునె కన్నాడు ;
తేనివాడు, రానివాడు—

రుజలేకుండగ, ప్రాణం-భుజములందు గొసరిస్తూ,
గోలుపోయి నాడాతడు - నిజమైన కూలివాడు—

నల్లరాతి అంగుళాల - ముప్పావుల అరల నురుసు
తో, ధూళిం బ్రుంగుడువడు - వారెందఱో, తోడివాండ్రు,
తొంగిచూచి రాగని, నా - డెవ్వరు కనిపెట్టలేదు
చచ్చిపోయె నతడని మఱి—

గనిలో నట్టడుగురాయి - పగిలి, బాటపెట్టినాది !
భూగర్భంలోని జలకు !-" నుయ్యిచేసినా" డన్నా
"రక్క ఱలేనిదె సంద్రపు - గొయ్యి చేసినా" డన్నా
రందఱు చూచినవారు—

## ఎరుగవు నన్ను ?

పోయావనుకున్నాను
నీవు ఏలోకంలోను లేకుండా
ఊరికేనే పోయావనుకున్నాను ;
పాయుఅంత ఎండిపోయి,
పర్వతాల్లా, ఇసకమేట్లడి
వాయి మూసేస్తే, ఇదంతా

వట్టి చోటనిపించింది
నీవు పోయావనుకున్నాను
లోకంలో నీ వూరూ పేరూ
లోకంలో, నీ వూరూ పేరూ లేకుండా
పోయావనుకున్నాను!
పాములాగు మెలికలుపడ్డ నీరంతా
వస్తుందా మళ్ళీ!—నిరాశ చేసుకున్నాను
సాముచేసిన కత్తిలాగు మెఱసిపోయిన వరదంతా
చూస్తానా తిరిగీ?—చూడ్డాననుకున్నాను
"ఇసుక శుభ్రంగా ఎగిరిపోతే
ఎక్కడైనా దొఱకవా?"
అని అక్కడేకూర్చుని, మేల్కొన్నట్టి
నా మక్కువెప్పటిదో?—ఏమైందో అదంతా?
ఎందుకు గొల్పావు? గౌతమీ! అంతలేమి?
నీవు తిరిగివచ్చే సూత్ర మాత్రం
బోధించి పోయావుకావేమి?
ఇప్పుడు నా యెముకలమీదనుంచి
ప్రవహిస్తున్నావు!
ఇప్పుడు నా కపాల రంధ్రాల్లోంచి
మట్టి కక్కుస్తున్నావు!—
నీవు తిరిగివచ్చే సూత్రమాత్రం
బోధించి ఉంటేనా,
ఏ తెన్నూ ఎఱుగని కొత్తనీటిమీద
నా కండగట్టిన నిండుఆత్మను
ఉఱ్ఱూటలూగించి వుండేవాణ్ని!
ఊ! ఉత్సాహపడి వుండేవాణ్ని! ఎరుగవునన్ను?

## చూస్తినీకంట

రావిచెట్టుకు పువ్వులేదు, రావిచెట్టుకు రంగులేదు,
రావితో కలిపారు తురాయి; రాగమానింది!

పడవలా రేపూకువెళ్ళ
ఎగుడుదిగుడు దారిమొగలో బాగుగొలిపింది!

రావియాకు రవళితో, నెఱ
పూతురాయి లేతచూపు పలకరించింది!

చెట్టుఅంతా ఆకులేక
మట్టిలో కుంకుమం మొలచె మాద్రి మెఱసింది

కట్టకడపటి రెమ్మకేసి, కాంక్షగొని కాంచితిని నేను;
ప్రాణమున్న మహాగ్నిజ్వాలగ
మనికిగొన్న మహాగ్ని జిహ్వగ ఉనికి చెప్పింది!

కౌగిలేసిన పచ్చిరావియె
సర్వసమిధై సంచలించె; చాయచదలంట!

దివ్యమైన శిరీషకుసుమం
వాడి పడియుంది మాయ మొదలింట!

నిజము పరికింప,
కూడియున్నది మూడో మోక, దిరిసె, నారెంట!
ఎవరు పాతేరో? చూస్తి నికంట!

## నావపై పిల్ల

నదినిండ నీరున్నదీ - నావపై పిల్లున్నదీ
పిల్లాకు వొళ్ళున్నదీ - వొళ్ళెల్ల వయసున్నదీ
ఏటికి మేటెక్కడా? - గోటికి దాసైనచాల్!

చిన్నాది పూదేనెరా - కవటాకులో ఈనెరా
పున్నామినెల బరణిరా - ముమ్మొదట నారాణిరా
నీతోటి ఏమున్నదీ ? - నాతోటి రమ్మన్నదీ.

మాటంటె బోటోనిదీ - అనకుంటె గోటోనిదీ
గొంతుకలొ పాటున్నదీ - అంతాట ప్రజ్ఞున్నదీ
ఎంత కూ సిగ్గంటునే - వింతకూ మొగుతుంటదీ.

చీకట్లొ కేకడతదీ - కేకెడుతూ కిందడతదీ
ఏ కాడ తడు మూదురా ? - ఆ కన్నె అతలేతరా !
పీకాను కాలేతునో ? - పయ్యంట చెయ్యింతునో ?

ప్రేమూడి ప్రాణాముగా - మానామెడానాడిగా
ఊపిరి ముందాడెరా - ఆపైని రూపాడెరా !
ఓపాటి స్త్రీగాదురా - నా పట్ల అతిసాధురా !

కళ్ళల్లొ ముద్దెట్టుతూ - తెల్లార నీ నంటదీ
తెల్లారిపోతుంటె తా - నెల్లాగొ అయిపోతదీ
ఒక్కళ్ళమై యున్ననూ - నక్కి తా నలు సొతదీ.

ఊదేస్తె గాలౌతదీ - రోదిస్తె నభమౌతదీ
దరితీస్తె నీరౌతదీ - బరిగీస్తె ధరణౌతదీ
పొగకట్టి కగ్గౌతదీ - ఇగనాకు దారేదిరా ?

మా యిద్దరీమధ్యనూ - బాలార్కు డుదయించుటా ?
బాలార్కు డుదయించి తా-మార్తాండుడై మండుటా ?
ఏనాటి వెలుగోపలేం - ఆ పక్క నీడాపలేం.

మే మిద్దఱం మేలుకో - పక్షుల్లు కావార్చుటా ?
కావార్చి కావార్చివే - కోవెలల దఱి మేయుటా ?
చీమంతరొద సొగలేం - కూనంతక్షుధ వేగలేం.

ఒకనాటి దైతేమిరా - ప్రకటితముగా వీడతాం,
మొగమోటమని పిల్ల నా - నగు పెదవి పేర్చెక్కిపో
కల్యాణమని పాడతాం - విశ్వ - కల్యాణమని ఆడతాం.

# అనవాలు మెఱుపులు

చెట్టుక్రింద కూరుచుంటె జీర్ణకుసుమంరాలె మీద !
జీర్ణకుసుమంతోటి నేను
చేరుకోగలనా ? దారి కనగలనా ?—

నీటబడితి, నేటబడితి, ఏటినీటి కష్టపడితి !
ఎండుపువ్వుతోటినేను
ఎదురుకోగలనా ? సదురుకోగలనా ?—

సాటివారికి చల్లవేళ, తోటివారికి దొడ్డవేళ,
సందెక్రిత మే నెంటిపూటలొ అందుకోగలనా ?
వతలుపువ్వుతోటి నేను ముందుపోగలనా ?—

కళ్ళనీరు గ్రమ్ముకొనియె, వల్లమాల్ని చింతపుట్టె ;
కళ్ళనీరుగార్చునంత క ముబరువెక్కె !
కరువుపువ్వు ఉరకమోస్తూ
కాంతికనగలనా ? శాంతి మనగలనా ?—

తలనువెండుకలు రవుగాగల
నెలతయొర్తుక నాకునెదురై
పువ్వుతనకై కోరినట్టుగ నవెనావంక—

తిరుగనవ్వుచు నివ్వబోయి
మఱల నెపువ్వంక చూస్తూ,
ఆసలుపువ్వే కోసియిస్తా నటుల రమ్మంటి—

విసములా గా చెట్టునెక్కి పసరుపువు గోస్తి
రాలుపువ్వది యెపుడువడలిన
దేడవదలిన దెఱుకపడలే
దతివ నేనూకూడా నెమకితి
మంతపథమూను ! అనంతపథమూను !
అనవాలు మెఱపులేమో ?
జ్ఞానమార్గపు గఱపులేమో ?
కలికి కళ్ళల్లోకి చూచిన గాంక్షతీరదుగా !
తలపులా చా యంటదలచిన దప్పికారదుగా.

## స్వేచ్ఛ చెన్నొందు

చేతిలో దీపంబుపెట్టుకు చీకటిని నే నడచుదారే
తెల్లవారి రదారి యయ్యెను ;
నీ వెలుగుజాడను కూడ నడచిన
ప్రజయొకండొక లక్షయయిరి - సూర్యుడటు పొడువ-

జారవిడువర దీపమింక తేరులాగర సోదరులతో,
దివ్యమగు నీ జయపతాక దేవతల ముంగురులుతాక—

భవ్యమగు నీ యభయహస్తము
నవ్యగీతం బభినయింప ;
వేలుపాటలు విశ్వమందు ;
రథిక పథికుల ఏకఫలమై స్వేచ్ఛ చెన్నొందు.

## ఆ పువ్వే - ఆనవ్వే

ఆ పువ్వే నివ్వెట్టాకుంటే - చూపులో చోద్దెంలేదు ;
ఆ నవ్వే నివు నవ్వాకుంటే - అనుకోనవకాశంలేదు.

మెడలో నీ కున్నదల్ల - నల్లపూసాలవెలితి
బిళ్ళదారపుబోచ ...ఆ పువ్వే

నడలో నీ కున్నదల్ల - కాయాగాసీనవ్రేళ్ళ
మాయమట్టెలరవ్వ ...ఆ పువ్వే

ఇలలో నివు కట్టిందల్ల - మూరాతక్కావ ముదుక
గోరంచొ గవ్వంచొ చెల్ల ...ఆ పువ్వే

బంగారు పువ్వాకాదు - బంతిపువ్వేనుపచ్చ ...ఆ పువ్వే

సిగచుట్టీ సిగలోకాదు - అగపడ్డ పాటుగానె ...ఆ పువ్వే

సట్టింటా పండక్కాకాదు-వట్టప్పు డుత్తనెదారి ...ఆ పువ్వే

## ననకారు

ఏటేటా చిగురుపట్టి - ఏటేటా పూతపూసి
కోటి వత్సరాల ప్రేమ - కూడబెడతవి
చెట్లు - కూడబెడతవి.

రావిచెట్టు ఎఱ్ఱచిగిర్చి - వేపచెట్టు తెల్లవిరిసి
కుఱ్ఱతనపు గోరికొ(క్రొ)ద్ది - కూడియుంటవి
చెట్లు - చేరియుంటవి.

పిల్లదాన్ని పిలవబోయి - పిలుపులోనె పిల్లంగ్రోవి
ఊదబోయి గేదెలోడు - నిదురబోతడు
నీరవంగ - చెట్లక్రింద - నిదరబోతడు.

ఎడకాంతి ఎందుకంత ?
నెమకులాడి నేరనిదేనా ?
వెదకు యువతికి వెరవేలేదా ?

కళ్ళుమూసుకొంటు వచ్చి - కౌగలిస్తది !
నిదరోయే వానివొళ్ళు - పులకరిస్తది !
మదిలో నీడ ముదియకుండ - తొలకరిస్తది.

## త్యాగసుధీ

రామనామమున కీవు - సామగానమిడినావు !
ప్రేమ మందె గొలిపి, పరం - ధామ నిలిపినావు !

అరవనాడు మెట్టినావు - కర్ణాటము పాడినావు,
తెనుగు తలపు తట్టావు - దివ్యుడవైనావు !

శోకము నీరాగరసా - లంబనమున మానముగా
తంబురతో నంబరమును - తాకినావు ! త్యాగసుధీ !

# చిలకలచీర

చిలకల చీర - చుక్కల రైక
గలగల గాజులు - కలకల చూపులు
గల యొక జవరాల్ - మిలమిలమంటూ
అడుగులు గబగబ యిడుచూ నడుచున్.

ఆ-సొగసుచూచికాదా - ఆ-కోడెకాడు మదిలో
నలరి తలరి యాపెన్ - అనుసరించుచుండెన్ ?
ఆ-వయసుచూచికాదా - ఆ-కోతయన్నవడిమై
అంత-అంత-అంగన్ - అందుకొనియె నాపెన్ ?

" సందెలడియె బావా !"
" అందుకనియె నేనూ !"
" సందెలిడత యొకటే చఅ చఅ
మని నడువ సాధనంబ ఏమీ ?"
" చీరచిలక !"
" ఇంకా ?"
" రైకచుక్క !"
" ఇంకా ?"
" గాజులులివు !"
" ఇంకా ?"
" మోజుమురువు !"
" ఇంకా ?"
" ఇంకా—సందెలిడత—అంతే !"
" అంతెకాదుబావా ! - ఆ వంకచూడుబావా !
ఆ సందుచూడుబావా !-నెలవంకచూడుబావా !
అందున్న జింక బావా !"

## ఒంటికొబ్బరి చిగురు

ఒంటికొబ్బరిచిగురు - జంటాకు నులియింపు
కంటితో వినుచుంటి - గాదనకు కాదనకు.
ఈలతోటాలోని - పాలపిట్టాచాయ
వీనులా గనుచుంటి - లేదనకు లేదనకు.
విల్లమ్ము బద్దల్లె - వినువీథి వంగొంగి
మనసు మనసులొ చెదర - మనమీదదేలింది
ఎట్లనకు ఎట్లనకు.
నడికుప్ప చందురుడు - గుడికట్టి గుండ్రంగ
మంచుబిందులగనులు - ముంచెత్తు జల్లంగ
కిమ్మనకు, కిమ్మనకు.

## చెట్టంత పువ్వు

చెట్టంత పువ్వు - పువ్వంత యెఱుపు
ఆ చెట్టు క్రిందుండు - ఓ చిన్నదానా !
పై చెట్టు క్రిందుండు ఓ పడుచుదానా !
ఆ పక్క నీ పక్క - నాకు పచ్చని చెట్ల
యాకుల్లొ యల్లాడు - పసుపు పుప్పొడికెంపు
మిసిమిమెత్తనిపువ్వు
లా చెట్టు క్రిందుండు - ఓ చిన్నదానా !
పై చెట్టు క్రిందుండు - ఓ పడుచుదానా !
సంజపొద్దటుచన్న - చిమ్మచీకటియైన
మనసంజపొద్దదే - మనహద్దు మనసుద్దు
ఆ చెట్టు క్రిందుండు - ఓ చిన్నదానా !
పై చెట్టు క్రిందుండు - ఓ పడుచుదానా !

## ఆకు ఆకు చాటునుంది

ఆకు ఆకు చాటునుంది - అచ్చంపు మల్లెమొగ్గ!
మాకు మాకు మాటునుంది-మంచినీళ్ళ నీటిబుగ్గ!

మల్లిమొగ్గ కావాలంటే - మంచినీళ్ళకు రావాలోసి!
వచ్చి పావంచాలకాడ - ముచ్చటాడి పోవాలోసి!
ప్రొద్దుకుంకు పాటులోన - పొన్నచెట్టే ముద్దుగున్న
నల్లనయ్య నమ్మకుంటు - చల్లవెన్నెల సాగాలోసి!
వెన్నెలలో వెల్లమొగ్గ - మల్లెమొగ్గ మఱవాలోసి!
మొగ్గవిడిసి పువ్వుపూయ - పూలదండ దేలాలోసి!

ఆకు ఆకు చాటునుంది - అచ్చంపు మల్లెమొగ్గ!
మాకు మాకు మాటునుంది-మంచినీళ్ళ నీటిబుగ్గ!

## రంగేళిరంగ!

రంగేళిరంగ! - రైకజేబులో పైకమున్నాది
కోకకొంటె కూరరాదు - కూరకొంటె కోకరాదు
కోరికసూడొస్తె రెంట - కూరుకున్నాది ...రంగేళి

చింతపిక్కలాంటి అత్త - సంతకెళ్ళి మళ్ళివస్తూ
చింతపువ్వు క్రొంజీరకట్టుక-ముంతలమ్మిన ముచ్చటన్నాది
మోదుగూపువ్వు ముఱుసుకున్నాది-బుక్కవానీ బుట్టనుంచి
పుఱుకి పుచ్చుక తెచ్చితీనని - చుక్కలాంటి బొట్టునాకూ
నొక్కిపెట్టి చక్కదిద్ది - చక్కనినాకోడలా అని
చక్కిలిగిలిపెట్టె - గల్! గల్! ...రంగేళి

## అనుజ రామరాయ! (కీ. శే. బామెర్ల రామారావు.)

ఆ కళారత్న మిస్సీ! - కట్టెయగుటెట్లు?
నవనీతపుం గుంచె - నాడిసోకమియెట్లు?
చిత్రకారునిసొగసు - క్షితికి బరువౌటెట్లు?
నమ్మజాలనునేను - నమ్మనేరను హరీ!

అతడు "నాకొడు" కంచు - అమ్మతలంచుటా?
అతడు "తమ్ముం" డంచు - అన్నస్మరించుటా?
అఖిలాంధ్రలోకంబు - అనుకొనియున్నదే
లలితకళకుం గ్రొత్త - లాలిత్య మొదవునం
చతనిచేతనకీర్తి - అతులితంబగునంచు
హతవిధీ! హతవిధీ! - అదియేని తలపోయ
కయ్యో! అయువున్న - అనిపించితివె యపుడె.

చిరునవ్వుమోముతో - చెంతనొక్కనిజేరి
సరసత్వమదిగొ అ - సరసజూడుముదీన
అనియేమొ తలపోయు - బాలేఖ్య సౌందర్యం
మందె ఆనందంబునందు నాతనిచూడ్కి
అలల గోదావరిన్ మలినమౌటదియెట్లు?
నమ్మజాలనునేను నమ్మనేరనుగటా!

ఇక్షువనకేళి నే దక్షత్వ మనుకొంటె
అల యలంకృత పుష్ప మంతకంటెనుమించె
ఎంచి పుట్టించె విరించి నిన్నువినన్
ఇంతలోనే చావు లెక్కించెనా నీదు
నూరేండ్లునుం గుట్టి! నేరనమ్మగనేర!

శాంతపథ మేవైపు స్వర్గసుఖ మెందెందు
ఆధ్యాత్మికపు ముక్తి అత్మకెచ్చట? ఎటు?
అచ్చోట నీ యాత్మ అమల నిశ్చలకాంతి
నైక్యమయ్యెడుగాత! అనుజ! రామారాయ!

# ఆవేదన

శాంతిశూర ! కర్మవీర ! సత్యాగ్రహధీరా !
నీ - ఈ - మరణవార్త
ఘోర, మతికఠోర, మరరె ! బోర
ఢాం ! ఢాం ! ఢాం ! క్రూర !
మరయ చిన్నమనిషివీ - ఒడనెంత రక్తమూ ?
కూడనెంత మాంసమూ ?
వాడు తినగజంపెనా ? - వాడు మనగ బేల్చెనా ?
తు - పాకి - వేట గూల్చెనా ?
తోడిమానవుండగున్ ! - నీడవాని కింకెటు ?
వేడికొనగలేవుగా ! - వీడిపోతివే భువిన్ !
మ - హాత్మగాంధి ! హా-హా-కారమయ్యె లోకము
ఆ - కారమెడసి నీవుపో-అంధమిడియె శోకము

కళ్యాణగుణపరంపరా ! నిర్యాణమీవుపొందితే !
భారతాంబ నీవ్వినా భయోత్పాత నిపతితం !

లేదె మృత ఆవల - వాదులేని సత్యము ?
స్వాదులైన అమృతం ? - గుండుగుండె చొఅగనే
వెరికి వెడలె హృద్ఘృతం ! - నీ సుహృద్ఘృతమదే
మాకు మాకు అమృతం! - శోకమార్పు సూన్నితం !

నెత్తురింత చిందకే - ఎత్తుకెత్తుతెచ్చితి
హామారదేశ స్వతంత్రత ! - నీ స్వతంత్రతీవయో !
నెత్తురోడ్చి కంటివి ! ! !

ఓ మహాత్మ గాంధీజీ - ఏమహిమే నెవరిలో
నేన్ మహాపైనున్నచో-పునఃప్రాణు జేతుమోయ్

ఓ మహాత్మ గాంధీజీ నిన్ పునఃప్రాణు జేతుమోయ్
ఆదాకా చేతులెత్తి మ్రొక్క నీయ్ !
నీ-ఆత్మశాంతికొఱకు ! - నీ-ఆత్మశాంతికొఱకు !
నీ-ఆత్మశాంతికొఱకు ! - ఏ ఆత్మశాంతికొఱకు !
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

[ మహాత్మా గాంధీజీ స్మశాన గమనం వింటూ. ]

## విదియనాటి చందాయి

విదియనాటి చందాయి - అదె చూడు వినువీథి ;
పడమటంచునెసంజ - కడుపులో కాంతిల్లు !

పడియునైదునాళ్ళు - పాసీన వగదీఱ
అదెచూడు అదెచూడు !

ఖాదీతెలి నెలవంక - సూదికొమ్ము లజింక
యొక్కలై కనిపించు - ఎక్కడున్నవు నీవు !

చిన్నిరోహిణిచుక్క - సన్నసన్నగజూచు
మున్నుబాసినముద్దు - పున్నమిగుఱుతుకై !—

దిశకొట్టి కొసకంట - పసిమి దాళువపంట
తూర్పుగాలికిఁవాలు - త్రోవానె అదెచూడు—

నావనెక్కినపాప - లేవనెత్తెనుచాప
పావురాయిరెక్క - పల్లటీలనిక్క—

నూలుపోగొకటీయ - పాలమీగడతీయ
మేలు నా జాబిల్లి ; - నీకు లేదుగ జాలి—

విదియనాటి చందాయి - అదె చూడు వినువీథి ;
పడమటంచునెసంజ - కడుపులో కాంతిల్లు !

# స్వాతంత్ర్య ముహూర్తము

తెలవారదనుకొన్న దీర్ఘనిశీధిని
పలపల వేగింది, వనధి నడువీధి ;
కలల నే గడపిన గడియలబలము
ఫలము చూపెట్టింది భారతావనిని.
గంటలు కొడుతూంది గణగణ రాత్రి
వినరార ! సోదరా ! వినర ! వినుకోర !
తొలి ఆరు గణ గణలు ఆంగిలేయులవి !
మలి ఆరు గణ గణలు మనవి, మన సొంతం !
ప్రథమ షట్కము లొడుగు పారతంత్ర్యమ్ము !
తరువాతి షట్కమ్ము కాంస్య స్వతంత్రం !
అరయరా ! సోదరా ! ఆలకించుమురా !
మొదటి అరూమ్రోసి మూగలై చనెరా !
పిదప ఆరూ వాసి వీనుల్లమనురా !
పట్టరా నీచేత పట్టుటెక్కెమ్ము !
పెట్టరా నీ యూవి విశ్వభిక్షమ్ము !
రాణించు సోదరా ! బ్రహ్మాండపదవి !
బాలించుసోదరీ! భారతపుత్రీ !
ఎందరో మును దీనికొరకు హతులైరి !
ఎందరో మును దీనికొరకు ఖైవడిరి !
విరిగినలాటీలు విరబూసె! సద్యః
తొలగినప్రాణాలు తొంగిచూచెని !
నిలుపరా బావుటా ! నీ దివ్యధాత్రి !
శుభముహూర్తము సాగు జుక్క సుస్థిరత !
ఆదిమవాసులు, ఆర్యులు మున్ను
మాదిమాదనిచెప్పి మసలి రే మహిమ

ఆ దివ్యమహిమను అలరారుదాము
అందరము బృందముగ నందాము
" వందే! వందే సు మాతరం!
వందే సు రాజ్యం! జైహింద్! వందే!"

# భారత స్వాతంత్ర్య గీతిక

త్రెస్సెను శృంఖల, విచ్చె గవాటము!
లెస్సగు నుషస్సు దీ యుబలాటము!
స్వతంత్రభాస్కరు బాలకిరణమిటు!
చితారు, చిఱతలు, చేకొనిమీటు!
క్రొన్నిమేషమిది! కొక్కొరొకో!

చిన్నిమేషమిది! సెలగ కుహూ!
శుభంకరంబిక బ్రజాప్రభుతయొహో!
ప్రభాతపవనము వాయించు!
అభయంకరమిక నార్యావర్తము!
విభావరుల నెడ విదళించు!

తలెత్తి తిరిగే తలాటమైనాం,
లలాటరేఖలు బయల్పడెన్;
బలంబు, ఓజన్, గుణంబు, తేజస్
బిరాన మనకై ఫిరాయించు!

క్షుధార్తులుండరు, వ్యథల్ నహినహి!
పథాన సూనృత రథం బిక!
విధాన మైక్యత, అహింస సాధన
సుధీమతాక్షర సూక్తులిక!

ప్రపంచమంతకు ప్రకాశమానం!
అపాంపతిని నును బ్రతిఫలనం!
నిపాతమెఱుగని వినీలచలనం!
అపూర్వచక్ర ధ్వజాననం!

## అశోక చక్ర గీతిక

అశోకచక్రం - పరాక్రమంతో
పురాక్రమంగా - స్వరాజ్య ధీధితి
వెలిసింది! - గాలిని ఉయ్యాలూగింది!
తెలింది! - త్రివర్ణపటమునవాలింది!

రామరాజ్యమున కదె దిక్సూచి,
ప్రజాక్షేమమున కదె కాణాచి,
అశోకచక్ర దివ్యపతాక
విశాల విశ్వాంచలములకూక.

పరాయిపాలన, కిరాయి ఆలన,
సరాసరిక ఈ దండంతో,
సమస్త భారత మేరు శిరోపరి
తురాయి ఈ పయి నీ జెండా!
అశోకచక్రావక్రసునాకం
అశేషశేముషి స్వవివేకం
జయ్, జయ్, జయ్, జయ్, జయ్, జయ్, జయ్!

నవ్యాశకారంభం, భం, భం, భం,
భవ్యాకారంభవితవ్యం!
శ్రావ్యవినోదం చరితామోదం
జన్మభూమికథయీనుండి,
చుట్టూనిలబడి ఎత్తండి!
కట్టుపకాసులు! కలియండి!
అశోకచక్రానంద పతాకా
చ్ఛాదన మీలోచలవేకా!
జయ్, జయ్, జయ్, జయ్, జయ్, జయ్, జయ్!

## ఆంధ్రుని వీరగీతిక

కత్తి యెక్కడ ? - కటారు యెక్కడ ?
ఢమఢమ, ఢమఢమ - ఢమఢమ, మ్రోగే భేరీ !
రణభేరీ యెక్కడ ?

ఆంధ్రుం డెక్కడ ? - ఆంధ్రుని వీరులు
వెలమా లెక్కడ ? - రెడ్లూ యెక్కడ ?
తెలగా లెక్కడ ? - ధీమ్ ! ధీమ్ ! ధీమ్ !
గంటంబెక్కడ ? - తాటాకెక్కడ ?
వంతులవ్రాసిన - భారత మెక్కడ !
ఆంధ్రుని కవులు - నన్నయ్యెక్కడ ?
తిక్కనయెక్కడ ? - ప్రగ్గడ యెక్కడ ?
ప్రభాతమోయ్, సు - ప్రభాతమోయ్ !—

చిలుకెక్కడ ? - శ్రీశైలం బెక్కడ ?
ముఖలింగం బెక్కడ ? - రాయలుఏలిన
విద్యానగరము - పారముగాగల
తుంగభద్రానదిజల - పవనంబెక్కడ ?
మహాప్రసాదమ్ ! మహాప్రసాదమ్ !—

అందంబెక్కడ ? - చందంబెక్కడ ?
ఆంధ్రవధూటికి - అరచాలెక్కడ ?
ఆంధ్రావని శ్రీ - మహాలక్ష్మికి హారతిపట్టుక
మేల్కొలుపండోయ్ ! మేల్కొలుపండోయ్ !—

నాగావళితో - తాళంవేయుడు !
గోదావరితో - నాదం పలుకుడు !
కృష్ణవేణితో - నృత్యంసేయుడు !—

జయ జయ ఆంధ్రా! - రాజనరేంద్రా!
జయ జయ ఆంధ్రా! - ఖడ్గతిక్కనా!
జయ జయ ఆంధ్రా! - మంత్రిభాస్కరా!
జయ జయ ఆంధ్రా! - రుద్రమదేవీ!
జయ జయ ఆంధ్రా! - మల్లమాంబికా!
జయ జయ ఆంధ్రా! - అక్కన మాదన
బాలచంద్ర బల్ - రంగారావు
వెంగళరావు - పాపారావూ
బళాబళీ! - నివాళి ఆంధ్రా!
స్వాగతమాంధ్రా! బహూపరాక్!—

కత్తి యెక్కడ? - కటారు యెక్కడ?
ఢమఢమ, ఢమఢమ- ఢమఢమ, మ్రోగే భేరీ!
రణభేరీ యెక్కడ?

# రాష్ట్రదీక్ష

"వందే" అందాం! - రాష్ట్రమును కొందాం!
కొందాం! నునుస్వేచ్ఛనుందాం! - అందఱం ఆంధ్రులం
మందభాగ్యులము గాకుందాం! ఉందాం!
విందాం! విశ్వంపు చిందం! - శాశ్వతానందం!
అభినవాబ్దాది ప్రాతస్సంధ్య - నరవిందమట్టు పైకొందాం!
కందాం! కామితము - కళ్యాణసంహితము,
కనకసింహాసనము - కల్పతరు శాసనము,
బాహుబల దర్పంబు - సర్వంసహాచక్రకీర్తి కర్పూరంబు!
మందే! మందే! మందే! మందే!—

కంధికంటాకంచె - కంధిమీదకువంచె ;
కంచెమీదాపూత - వంచె లోనికివేత ;
మందే ! మందే ! మందే ! మందే !—

ఇదిగొ దీక్షాబంధ - మిదిగోను డెంచం !
గజములో జయభేరి - గాలిదేవునిస్వారి !
మాతరం వందే ! మధురాంధ్ర ! వందే !
"వందే" అందాం ! - రాష్ట్రమును కొందాం !

## ఎందుచే ! ఎందుచే !

కొరియాకు నొకచెంగు సయాముకొకచెంగు
పచ్చన్ని పారాణి బలిసుమాత్రాలపై
బరిభవింపగ నాట్యమాడింది తల్లి, తొల్లి పాటపాడింది !
ఎందుచే ? ఎందుచే ? - స్వేచ్ఛచే ! స్వేచ్ఛచే !—

గాలినాడూరకే కాసంత విసరితే
కదలియాడేవి మనతల్లి పెన్నెరులు
అల టిబెట్ దేశాన కాపైకి నాపైకి !
ఎందుచే ? ఎందుచే ? - స్వేచ్ఛచే ! స్వేచ్ఛచే !—

బుద్ధు డొకడుదయించి సుద్దులాడినయంత
సిద్ధివడసినవంట ముజ్జగములే జనము
లెందుచే ? ఎందుచే ? - స్వేచ్ఛచే ! స్వేచ్ఛచే !—

చాపెత్తి మనయొద్దు సెలవు నడిగితిమన్న
రూపించి దిఙ్మండలారోహణములోన
అగపించెనటమున్ను ఉచ్చైశ్శ్రవపుగళలు
ఎందుచే ? ఎందుచే ? - స్వేచ్ఛచే ! స్వేచ్ఛచే !—

# విమల భారత

విమల భారత! విశాల భారత!
విబుధ భారత! నివాళి - మా
మహా భారత! మధుర భారత!
మాత భారత! బళాబళీ!

సహస్రకిరణ ప్రసారి తారుణ
హిమాచలాఖిల శుభోదయమ్
విచిత్రమొహొ! ఒహొవిచిత్ర!
మవనీ వసీధునముని మణీమయమ్ ...విమల

మృగాంకతరుణ ప్రకాశ
మంజుల వినీలతటినీతరంగము
మనోజ్ఞమొహొ! ఒహొ! మనోజ్ఞ!
ముపరీ ఝరీ హరి శ్రితవరాంగము ...విమల

కిరీటి రథసారథి ప్రచోదిత
సితాశ్వఖుర భాస్వరక్షితి
నిదానమొహొ! ఒహొ! నిదాన
మహరహజయాజయాస్వనయశోన్నతి ...విమల

సయాము బర్మా బలీసుమత్రల
విశేష శేముషి కళాకృషి
ప్రబోధ మొహొ! ఒహొ! ప్రబోధ
మంబుధి సుధీనిధిస్తుతిలిపీమషి ...విమల

## జాతీయ గీతిక

హిమగిరి శిఖరము, వింధ్యనగేంద్రము,
కన్యాకుమారీ పదడిండీరము,
స్ఫురితము, భరితము, చలితోల్లసితము,
స్వాతంత్ర్యముచే ! స్వాతంత్ర్యముచే !
స్వాగతమనవోయ్ ! - కని, పనివినవోయ్ !
మనవోయ్ ! అనవోయ్ ! - జయ్ ! జయ్ ! జయ్ !

జాహ్నవి, గౌతమి, కృష్ణ, పినాకిని
కావేరి, నర్మద, యమునా, సింధులు,
ఆహర్నిశాదులు ఒకటే గానము
అలలో కలలో అదే ప్రయాణము
స్వాతంత్ర్యముకై ! స్వాతంత్ర్యముకై !
స్వాగతమనవోయ్ ! - కని, పనివినవోయ్ !
మనవోయ్ ! అనవోయ్ ! - జయ్ ! జయ్ ! జయ్ !

గుజరాట్, వంగ, అంగ, మరాటా
త్రిలింగ తమిళ కళింగమును జను
లజరులు, అమరులు, అనామయులుగా
స్వాతంత్ర్యము హొరాయ్ ! స్వాతంత్ర్యము హొరాయ్ !
స్వాగతమనవోయ్ ! - కని, పనివినవోయ్ !
మనవోయ్ ! అనవోయ్ ! - జయ్ ! జయ్ ! జయ్ !

నౌరోజ్ తిలకులు, లజపద్దాసులు,
దాని పథంబున నగిలిన నొగిలిన,
వెచ్చని నెత్తుటి దివటీ వెలుగునె,
స్వాతంత్ర్యంబదె ! స్వాతంత్ర్యంబదె !
స్వాగతమనవోయ్ ! - కని, పనివినవోయ్ !
మనవోయ్ ! అనవోయ్ ! - జయ్ ! జయ్ ! జయ్ !

ఇంగ్లండిటలీ, స్వీడన్ స్విజ్జు,
జపాను జర్మని, కీచుపరాసు,
అంబవిశ్వకళ కభివాదనమిడు !
స్వాతంత్ర్యమురా ! స్వాతంత్ర్యమురా !
స్వాగతమనవోయ్ ! - కని, పనివినవోయ్ !
మనవోయ్ ! అనవోయ్ ! - జయ్ ! జయ్ ! జయ్ !

## వొయ్యారి తెనుగు బావ

వదలవోయి నావ ! కదలవోయి బావ !
వొయ్యారి తెనుగు బావ ! నెయ్యంబు నెరపవోయి !
అరవలతో, తురకలతో, అమెరికనులతో,
ఆంగిలేయులతో - సయ్యాట లాడుకొంట
వదలవోయి నావ ! కదలవోయి బావ !

కొయ్యాను చాపిప్పవోయి - కోటికి పడగెత్తవోయి !
పదునైన నీ కత్తి, కుదురైన నీ యుక్తి
ఎదిరికి చూపించవోయి ! - ఎవరిని ప్రేమించవోయి !
వట్లపగ్గాల్లేని, పెగ్గెలు కావరచవోయి !
పౌరుషము, పాలనము, పై చెయి నీవేవోయి !
వదలవోయి నావ ! కదలవోయి బావ !

జెండా కొత్తది నిల్పి, నిండా బత్తినిగొల్పి
నీలాల కెరటాల, ఏలైన నీ హేల,
ఏలెయలా ! ఏలెయెలా ! - ఏలయుల, నేహొయల
వదలవోయి నావ ! కదలవోయి బావ !

విజయశంఖ మనుకనాల మూదవోయి !
ఇదియే మేలగువేళ ! వదలవోయి బావ !
కదలవోయి బావ ! వొయ్యారి తెలుగునావ !
వదలవోయి నావ ! కదలవోయి బావ !

## నేటికలవము - నేటినాగలి

నేటికలము - నేటినాగలి - గోటుగబోనీయరా !
ఈ యుగాది నీయదిరా ! - ఈ యుదయము నీదిరా !

శుభము సుఖము సిరి, సంపద-చూరగొనుమురా! ఆంధ్రా!
చూడిక్కయెల్ల సూన్నృతముగ-చూడరా నీరాష్ట్రము! ...నేటి
కోటిచుక్క లున్నగాని - చంద్రునదే రాతిరి !
ఏటిప్రక్క చిన్నదాని - దే అంతా ఏలుబడి ! ...నేటి
పాతపగలు మఱచిపోర ! - చేతనమిది క్రొత్తరా !
ఊతయివ్వ దుర్వ్యసర్వ - ముపరిసభము గూడరా! ...నేటి
వానమబ్బు గ్రమ్మియున్న - భానునిదే పగలుష !
తోట కోకిలానిదేట - గూటికొఅకు శషభిష ! ...నేటి
తల్లిపేరు " తెనుగుతల్లి "-ఇల్లు తెలియదనకురా !
చల్లనితావందు నిలిచి - ఉల్లములో నిలుపరా ! ...నేటి

## తువ్వ !

మల్లెపూ వన్నియల మంచి తువ్వ !
ఎందాక గంతుప్రోగింతు మువ్వ ?
చిగురుగొమ్మలనీడ చిన్ని తువ్వ !
బడలి నిలబడిపోతి వొడలి చివ్వ !
ఆకుపోతలపచ్చ నాడు తువ్వ !
అందుకొననా నిన్ను ? అమ్మ ! నీవ ?
ముందు గట్టెక్కితో ముద్దు తువ్వ !
కారెంపు బయిపాట కలికి రువ్వ ?
సారువా దాళువా నందుతువ్వ !
కన్నెత్రాడిదె నిన్ను గదల " నివ్వ. "

## ఎఱ్ఱ కలువపువ్వ!

ఓ! ఎఱ్ఱ కలువ పువ్వ! - నా చెంతకీవు రావ?
చెఱువుమధ్యమందె - ఇరవు గొనుచునుంద?
ఓ! ఎఱ్ఱ కలువ పువ్వ! - నా చెంతకీవు రావ?

రాతిరెపుడొ విడిచి - ఆ తిమిరము కడచి
ఉదయ భానుకాంతిన్ - సదమలమగు శాంతిన్
వెలయుచున్న పువ్వ! - నా చెంతకీవు రావ?

తూటికాడ పూలు - తెల్లకలువ చాలు
నా చేతికందుచున్న - గొరికలటు సున్న
ఓ! ఎఱ్ఱ కలువ పువ్వ! - నా చెంతకీవు రావ?

పంటకొఱకు కాపు - చిన్ని కొలకు త్రవ్వె
నీ కొఱకనుకొందొ - ఆకుతేల్చు పువ్వ!
ఓ! ఎఱ్ఱ కలువ పువ్వ! - నా చెంతకీవు రావ?

గట్లచుట్టు పండ్ల - చెట్లబెంచు గాపు
కాచుట కవికాని - నీ చలువ కొఱకుగాదు
నీటబుట్టు పువ్వ! - ఓ! ఎఱ్ఱ కలువ పువ్వ!

మెఱసి మునుగు చేపన్ - అరసి యతడు పట్టు
నిలిచి పూచు నిన్నొ - నేరడుగవ కాపు,
అతనికి గొఱగావో? - మతి యతనికిలేదో?
ఓ! ఎఱ్ఱ కలువ పువ్వ! - నా చెంతకీవు రావ?

నిర్మలోదకములన్ - రమ్యమగుచు నున్న
నీ రూపము దవ్వైనన్ - చేరువబలెదోచున్
నీ నీడ చెఱువులోన - నిలువున గనిపించున్
నా నీడ లందులోనె - నర్తించెడు నెడమేది?
చిఱుకరువలి యల లందున్ - ఐక్యమయ్యెనెల్ల
ఓ! ఎఱ్ఱ కలువ పువ్వ! నా చెంతకీవు రావ?

# శీతకాలపు సంధ్య

కొండదాపిని నొక్క రెంపట్టుబంటి
నేలెత్తుగాబోవ నెగసుగొంటు
తోలెడువాడువా దొట్టిలో నిదుర
వేపుచుండెను గాఢ భావంబుగదుర

శీతకాలపు సంధ్య చిఱుచలి సంధ్య
ఎట్టని సంధ్య సిత్పెఱుగని సంధ్య!

ఎడ్లను సడిగిరి నెందాకమీర
లేగ వారితీడు నెందాకసంటు
తోలెడువానికె తొందఱలేదు
నడువంగనేటికి నడువంగనేల ?

శీతకాలపుసంధ్య చిఱుచలి సంధ్య
ఎట్టని సంధ్య సిత్పెఱుగని సంధ్య!

అంతలో లేచెనే యా బండియుబ్బి
దబటబ కొట్టెనే తనయెడ్లనయ్యొ!
పరుగిడజొచ్చెనే పై యూరుదాక
గంగడోల్లాడంగ గంటలుమ్రోయ

శీతకాలపు సంధ్య చిఱుచలి సంధ్య
ఎట్టని సంధ్య సిత్పెఱుగని సంధ్య!

ఎందాక నగునట్టి యెఱుగనౌపల్కు
లవి వినకుండనే యరిగిసవెళ్లు
బండియు నరిగెను బండివా డరిగె
ఎందాకనో నేరకే నిక్కడుంటి

శీతకాలపు సంధ్య చిఱుచలి సంధ్య
ఎట్టని సంధ్య సిత్పెఱుగని సంధ్య!

## పాటచలువ

కెంపుల తులకింపులతో - సొంపులొలుకు లేతవెలుగు
సూర్యకిరణ తీవ్రకాంతి - మెఱుపుగ మిఱుమిట్లుగొలిపె
కాల్వనీటి గోడువెచ్చ - కాలుమున్నపాతులగుమి
తలలవెన్ను పూసలెత్తి - అలయక శిలలట్లు నిలిచె
వెల్లగిత్త నల్లనావు - మోముముక్కు మురుపుతేగ
మున్నుగగలవైదొయారొ - కూడియున్న గోకులంబు
ప్రక్కప్రక్క బచ్చికలను - మెల్లనడక మేయుచుండె.
పెద్దయెడ్ల గంట్లబండి - సద్దుసద్దు సన్నమోత
నిదురజోగు బండివాని - మదిని గలలమార్చుచుండ
వానిమోముపైని వసన - గాను గాకు నీడవిరిసె
గోపమానవకు డొకండు - పూవమావి పిందెదారి
జేతనున్న కట్టెవిసరి - చెట్టుచూచి కొట్టుచుండె
అట్టివేళ నాకు నెట్టి - ఇంపటంచు నెంచుచుండ
నుక్కపోత నొక్కగాలి - పాటచలువ నాకెహాళి.

## జీవనగీతిక

జీవన మొకసన్నజాజి చిన్నమొగ్గకదర!
దినదినమును జ్ఞానమనెడు తెలి రేకులవిడుచు ;
జీవన మొకటిట్టె తోచు చిట్టిమేఘముకదర !
చిరునగవను "ఇంద్రధనసు" సింగారంబొసగు ;
జీవన మొకతెరచాపను బోవునావకదర!
మోక్షమనెడు పారంబును బొందజేయుతుదకు ;
మృదుమధురము దానితేనె - పదములంబు దానిచినుకు
వదలకుండు దానిగాలి - స్వచ్ఛందము జీవనంబు
సౌఖ్యదంబు జీవనంబు - సాధకంబు జీవనంబు
జీవనమది యేలాయని చింతసేయబోకు.

## మేకలార!

ఏమి మీ సంస్మరణమో మేకలార!
ఇంపైన సంజను విసుడు గ్రుంకెడుచాయ
వానకురిసిన వెనుక వాసించుగాలిలో
చెదరుమబ్బులమఱుగు వదలు క్రొన్నెలకాంతి
దిన్నని "గోదారి" తీరంపు చెన్నున
ఏమి మీ సంస్మరణమో మేకలార!

మేసిన మీ మేత నెమరు వేతలను,
జూపిన మీ మేని సౌకుమార్యముల,
అటునిటు వోవువారను శంకలేక
హాయిగా దలలెత్తి యతిశయించుటను
ఏమి మీ సంస్మరణమో మేకలార!

పచ్చనితుమ్మాకు పఱపఱ నమలు
నప్పుడు మీకున్న చుఱుకుదనము
అంగడి కూరగాయల నమ్మికొనెడు
వారలగంపలవడిలాగు నపుడు
మీరు చూపించెడు నెఱిదుండగములు
వదలి యెంతయు జక్క గుదురుగనిందు
గోముచూపెడునట్టి యో మేకలార!
ఏమి మీ సంస్మరణమో మేకలార!

చిన్నారి పొన్నారి చిట్టి నెలపొటుపు
ప్రొద్దుగ్రుంకెడు చింత పోగొట్టుననియ?
మన్నెంపు గొండపై మబ్బులో మెఱపు
తీసిపోయిననదిని బోషించుననియు?
ఏమి మీ సంస్మరణమో మేకలార!

## వెలుగ

బెండు తెప్పను తీల విలసిల్లు వెలుగ!
ముత్తైదుచేజాతి ముదమందు వెలుగ!
చల్లని చిఱుగాలి జలియించు వెలుగ!
అలలపైనోలాడు చరిగెడు వెలుగ!
ఆవలిలంకకై యాసించు వెలుగ!
మిన్ను మిన్కనుకొంచు మిగిలెడు వెలుగ!
బొమ్మలనోముగా బొలతులు నిన్ను
విడిచివారలదారి వెడలిరివారు
" పాలలోబుట్టిన పడతి " గపిరమ్మ "
నీళ్ళలో గలిసెనే నేడం " చు నేదొ
యటువంటిపాటతో నానందముగను
నీ మిన్కు వెనువెన్క నీటుగాజూచి
యరిగిరి నీ వంక నరయరు సుంత
నీకు దవ్వగుచుండె నీలాటరేవు
నీ భంగములు తప్ప నిలుపోపు వెలుగ!
నీ వెంట నీదంగ నేరరెవ్వారు
నా కింక సెలవిమ్ము నా యింటి కరుగ,
నే నాడొ వేసవి నింపుగలంక
నాడంగ బాడంగ నటువచ్చి నిన్ను
జూచెదనోవెల్గ! చూచెదగాక!
అనుచు నే నొక వెల్గు నరయుచునుండ
నది కెరటంబుచే నప్పుడే యాతి
చీకటిబయలయ్యె జిన్నటిపాయ
ఏ నావపై నేను నే త్రోవజనిన
నా వెల్గు నా కింక నగపడునదియె ?

అగపడునేమొకో యలబెండుతెప్ప
తెప్పపై వసివాడి లెమలిన పువ్వులు
చినిగిన కాగితాల్ చెదరిన పెమిద
అంతియేకాని యా కాంతి కన్పడునె ?

## పసుల కాపరి

ఓ ! పసులకాపరీ ! - ఓ చిన్నపాపడా !
ఏ పాట పాడుచుంటి ?
ధూళిబాటను నాల - మందలను దోలుచును
ఏ తాళమేయుచుంటి ?
కూనరాగముపైక - గొసరింతువేకాని
పలుకు స్పష్టంబుకాదు.
లేదూడపై వ్రేళ్ళ - నాడింతువే కాని
ధ్వనిసుంత చెవినిబడదు.
ఆనంద మగ్నతన్ - అతిశయింతువునీవు
సంజ వెన్నెలలనైన.
దొందరించుకలేదు - తొట్రుపాటునులేదు
నీ నడను దూడ నడను.

## వఱదలప్పుడు

"గోదారి" వడినొక్క - టేదో పక్షియాకె
యీ దరికి గొట్టుకొంచేగుదేఱ
జేసాచి యొకకుఱ్ఱ - తీసిదానిని దుడిచి
వాసిమై బరికించె వ్రాయుటకో ?
ఓసి ! కనుమనుండొ - నాసికా త్ర్యంబక
వాసంబునుండియో వచ్చితనుచు.

# మాఘమాస మధ్యమందు

నేలబడిన యెండుటాకు గాలికెగిరి గల్ గల్ మన్
క్రొత్త క్రొత్త యాకుమొగ్గ కొమ్మదొడిగి
కిమ్మనవే మట్టిచెట్టు మాయలేమొ !—
ఎండుటాకురాల్చు టెపుడొ యిగురుటాకు ధాల్చుటెపుడొ
మాఘమాస మధ్యమందు మాపొతెపా సంజపొద్దొ ?
వెదురుబిడెపు వయసలహహా! యొక్కదాని నొకటియిట్టె
కౌగిలించుకొనుచు బుంతబైరుగాలి పైకొనుచును
క్రమరవములెసగించెడు రవములెసగు రహినెయిలకు
వలిచి వలిచి వైచినట్లు పండుటాకు వ్రాలిపడెడు
బచ్చనాకు బయలుపడెడు ఏమిసొబగు లేమిసొంపులో !
మావిజీడి మావిచెట్ల పరిమళము లపారములుగ
ఈ తయి దంగేడుకూడ పూతపూచి మోదమిడుగ
మొలకమొలక కెలననిలిచి చూడజూడ జోద్యమొదవు
ప్రాతసరణిమార్పుచూతునా? క్రొత్తసొగసుకూర్పుచూతునా?

# ఆశయము

కడలిసట్టడగు పాడము - మత్తియమ! నీదు శాంతిన్
బడయగను మునుగవలెనా ?-వలలెన్ని పన్నవలెనా ?
ఈ నాదు తీరమందే - భంగముల వెలికిబడెడు
గుల్లలను గూర్చుకొనుచు - నేనేల యాడరాదో ?
ఆకసము నట్టె పాడుచు - చుక్కరో నీదు కాంతిన్
జేబట్ట నెగురవలెనా ? - ఱెక్కలూనంగవలెనా ?
నేనేల నిలువరాదో - యీ నాదు పొలమునడుమ
గ్రిందికి వెపుడు పడెదో - యపుడె నిన్నెరసికొనుచు ?
సంతుష్టిలేదు మదికిన్ - సంతసములేదు తుదికిన్
ముత్తెసరికెఱుగువఱకు - చుక్కజిగి కెగయువఱకు.

## చిన్ని మేఘమా!

నన్ను దఱుముకురాకు నా చిన్ని మేఘమా!
నన్ను దడుపగబోకుమో నీలమేఘమా!

పచ్చవరిచేలపై రిచ్చవడి నినుగాంతు
నచ్చంపు జినుకులను ఆ చేల జిలికించు ...నన్ను

అడవి మల్లియ పువుల నాడింప నిన్నెంతు
జల్లనౌ నీ గాలి సాగించు వానిపై ...నన్ను

సూర్యబింబపుగాంతి సొగయింప నినుమెత్తు
జలువయౌ నీ నీడ జఱిగింపు మీ కడల ...నన్ను

మెఱపుజిగులిట్టిట్టె మెఱయింప నినుజూతు
సురుచి రాకాశాన జూపించు నీ హొయలు ...నన్ను

ఉండియుండి యుఱుము లుదయింప నినువిందు
రోదసీ సీమ నీ రూపంబు వెలయింపు ...నన్ను

గొప్పగా నాపైని గొడుగు తీరుగ దలతు
దిఙ్మండలాకాంక్ష దిశలెల్ల గ్రమ్ముమా ...నన్ను

## అపరిమితానందము

తొగలచెలుని - తొగరుమొగము
పున్నెపుదొలి - పొడుపుసగము
" ఏనుగు కొం - డె " క్కియుండె
పడమట " బే - పావ " బండె
సంజహద్దు - మునిమిపొద్దు
ఆనందం - బమరె వివగ
నెదుట నీటి - పాయచనగ

ముసకలిడగ - ముచ్చటెసగె
లోలో - దన యంతబొసగె లోలత
ఉత్సాహమట్టె - హెచ్చెను
గిలిగింతల - నవ్వేయన
నవ్వితినే - నేనకాను
నదియును వె - న్నెలలనగవు
నిండునగియె - దనదుకడుపు
చెక్కలయిన - వడుపువెఱసి.

## మొలక - తరగ

ఓ ! చిన్నిమొలకా ! ఊరకే కనిపించు ఓ ! గడ్డిమొలకా !
నీకు నెగడునె యొక్క నిరైన నిశ్వాస
మున్నదే నీకొక్కయొప్పైన యుచ్ఛ్వాస
మదిలేక యిదిలేక యా వీచుపెనుగాలి
నాడింతువే నీదు నౌదలను మొలకా !

ఓ ! చిట్టితరగా ! ఒడ్డునను విఱిగేటి ఓ ! కూనతరగా !
నీకు నెగడునె యొక్కనిబ్బరపు మార్గంబు
ఉన్నదే నీకొక్క యున్నతపు టాశయం
బదిలేక యిదిలేక యా పెద్ద "గోదారి"
నోలాడు దేనీదు నుఱకలను దరగా ?
మొలక ! నీ పరిమళపు బువ్వు వికాసమ్ము
తరగ ! నీ తెలినురుగు సుందరహాసమ్ము
పెనుగాలి మఱపించి పెన్నదిని మురిపించి
మీ స్వభావప్రభలు మినుముట్టజాపెడిని
చిన్నారి ఓ ! మొలక ! ఓ ! చిట్టితరగా !

# ఒక అపరాహ్ణమున

జాము జాము న్నఱ ప్రొద్దుంటజూప్ర
ఎండపొడు కనకవలు ఇంక జెలగెడిని
ఉత్తచోటులనైన నుక్కయేసుండు
మండువేసగియైన మసలనేలేము
కాని యా కొనలో గనిపించునవిగ
ఇరుగడ శరవ పుటినేటి చేలు
చేలపయి నడచేటి దూదిమేఘాలు
మేఘాలు విడనడు నీలంపుజాలు
ఎండకన రోదసినెద గుచుజేలు
నులివెచ్చ నీరాల దుబ్బులుకట్టి
సిరికి దావలమైన సింగారమూనె
అక్కడక్కడరైతు అగపడె నొకడు
తెల్లని తలపాగ మళ్ళకుడునడుమ
దొంగిలిచూడంగ నొంగుని కలుపా
యొత్తుగ బెఱిగిన యూటలో మొలకొ
గట్లపై బలిసిన గఱికనో పెఱికి
యొకదిక్కు విసరుచునుండుండిపైకి
నలుదిక్కులనుదన పొలముగన్గొనుచు
నక్కడక్కడరైతు అగపడెనొకడు
ఎల్లపొలములు తడిపి యెవ్వరికొఱకు
నేగుచున్నదింకీ నీరమన్న
పోలికనడ్డుకట్లేమియులేక
"గోదారి" వఱదకో మున్నీటిరొదకొ
తిన్నగా బంటకాలువ జాలువాఱు
కనబడకొక పిట్ట కంఠంబునెత్త

వేఱుపఱుపని వింత ఏనుకలిబడియె
ఏక ఖండపు టూడ్పుకొంద్రయదెల్ల
మొఱకుమూ గలకును ముచ్చటగొలిపె
చిన్నారి వరివెన్ను చెవియొగ్గి వినియె
మితిమీఱి చనుకొల్వ మృతిలేని ధృతిని.

## ఏమంటవూ నీవు రానంటవా ?

ఏమంటవూ నీవు రానంటవా ?
ఓడతెడ్లు గూడతోడు - ఒక్కలాగు చప్పుడౌను
రాజుకోట నిమ్మతోట - ఒక్కలాగు చల్లగుండు
ఏమంటవూ నీవు రానంటవా ?

ఓడెక్కి 'రంగ మెళ్ళి' పోతనంటవా ?
గూడచేత బుచ్చుకోని గునుస్తునంటవా ?
రాజుతోడ 'రాజమంద్రం' చూస్తునంటవా ?
నిమ్మచెట్టు నీడపట్టు నిలుస్తునంటవా ?
ఏమంటావూ నీవు రానంటవా ?

కాసుమాడ కోడెదూడ - ఒక్కలాంటి బేరమేను
సంజమాయ ముంజకాయ - ఒక్కలాంటి సారమేను
ఏమంటవూ నీవు రానంటవా ?

కాసుజూసి కటకమునకు గదలిపోతవా ?
కోడెదూడ తోలుకొంటు సంతకొస్తవా ?
సంజపొద్దు చన్నపట్నం సాగిపోతవా ?
ముంజకాయ తింటు కల్లులొట్టి మోస్తవా ?
ఏమంటవూ నీవు రానంటవా ?

తెల్లమల్లు మబ్బుజల్లు - ఒక్కలాగె చలువసేయు
సైనుతాను కొతచేను - ఒక్కలాగె ఒళ్ళుమూయు
ఏమంటవూ నీవు రానంటవా ?

తెల్లమల్లు గట్టుకోని దేశమెత్తవా ?
మబ్బుజల్లు మలుపుకుంటు - మంచిగుంటవా ?
సైనుతాను చింపుకోని సీమకెత్తవా ?
కోతచేను కోసుకుంటు కులుకులాడ్తవా ?
ఏమంటావూ నీవు రానంటవా ?

పిల్లిపాగరు చింతచిగురు - ఒక్కలాగు పుల్లగుండు
మేనబావ చందమామవ - ఒక్కలాగు మేళవించు
ఏమంటవూ నీవు రానంటవా ?

పిల్ల ! ఒంటి విజయనగరం లెగిసి పోతవా ?
చింతచిగురు పప్పుకూడు సిమత పెత్తవా ?
చందమామగారి యూరు చక్కపోతవా ?
మేనబావతోడ నీవు మేల మాడ్తవా ?
ఏమంటావూ నీవు రానంటవా ?

## సుందరతర శరదిందు

సుందరతర శరదిందు కందళిత కౌముదినిగందు
ఎందుదాని విశ్రాంతి ? ఎందుదాని పరమశాంతి ?
మూనతిరిగి మొదలు పెఱిగి యీ నేటి వరిచేల
దేటనీట దెలివిదేఱి చలువగొన్న కలువపూల
నిర్మలాకాశవీథి నీహారాంబువులమాల
నట్లతద్దియాటలాడ జెట్లపట్ల జనెడు బాల
సుందరతర శరదిందు కందళిత కౌముదినిగందు.
క్రొత్తవెన్న కొసరినిలుపు పాలలోన ప్రతిఫలించు
మెత్తని మృదులంపురేకు లొత్తుడు పడకుండనిదుర
నత్తమిల్లు నర్మిలినది పతిత కిరణార్ద్రశోభ
నాఱబోసి నట్లపఱచు ఆట పాట నలరునట్టి
కుటిలాలకతోడ నవ్వు, అందమైన శరశ్చంద్ర
చంద్రిక సౌభాగ్యమోహో !—

# వరహాలరాజా!

కళ్ళములో చూచితివో — వరహాలరాజా!
కాటుక కళ్ళనియుంటూ — వరహాలరాజా!
వట్టిగడ్డి మోపెత్తితివో — వరహాలరాజా!
పట్టెడ మెడపెఱిగింది — వరహాలరాజా!
బంగారు పాయాలు — వరహాలరాజా!
చెంగున నేల్జిమ్మాయి — వరహాలరాజా!
వడ్లగింజ లంతేసి — వరహాలరాజా!
వడ్లపాల్లు గలిసాయి — వరహాలరాజా!
చేటనెత్తి చెఱిగితినో — వరహాలరాజా!
చేతబోసి లెక్కిడితి — వరహాలరాజా!
రెండుపదులు ఇరవై — వరహాలరాజా!
మూడుపదులు ముప్పై — వరహాలరాజా!
నాల్గుపదులు నలభై — వరహాలరాజా!
అయిదుపదులు ఏభై — వరహాలరాజా!
ఆరుపదులు అరవై — వరహాలరాజా!
పయట చివర గట్టిగను — వరహాలరాజా!
మూట గట్టుకొన్నాను — వరహాలరాజా!
మూట గట్టుకొని నేను — వరహాలరాజా!
మోపు నెత్తుకెళ్ళాను — వరహాలరాజా!
దిస్సమెడను జూచింది — వరహాలరాజా!
కస్సుమంది నాయత్త — వరహాలరాజా!
చెంగు చూచుకొన్నాను — వరహాలరాజా!
దొంగవీవ అన్నాను — వరహాలరాజా!

## దారిగా దిది

రంగురంగుల బొంతచీర, మె
ఱుంగుటద్దపు మేలిముసుగు,
చెంగునను మెఱసింది చేలో !
అంగనామణి యెవ్వరో ?

కంగుమన్నాయి కాళ్ళమువ్వలు,
గలగలామన్నాయి గొలుసులు,
వెండిబిళ్ళలు, తెల్లగాజులు,
వ్రేలుచూ నులిసె.

ఇల్లువాకిలిలేక యెప్పుడు
వీధిబిగ్గర బిచ్చమడిగే
వెలదినెవరే మడిగికొందురు
వీధులంబడి పో ?

వెలదివెల్లడి స్వేచ్ఛ నిలబడి
తనదె యందంబనుచు గనబడ
వినయమున దరిజేరి నారలు
గొనబు లడుగుచును.

గొడ్లకాసే పిల్లకాయలు
గోళీలాడే కూచికుఱ్ఱలు
గోష్ఠిగొలుపుచు దానినడిగిరి
కూంత కాంత యెదో.

వింతబాసను వేగబలుకుచు,
పెదవులను చిరునవ్వు వదలుచు,
కదలకయ కన్నులను గదలిచి
కాంత యిట్లనియె.

" వేఱెమోక్షము లేదమీకు ?
వేఱెమార్గము లేదమీకు ?
మీరుమీరూ వెళ్ళిపోండి
దారి యిదిగాదు. "

" దారి గాదిది " యనిన వడుపు నొ
యారిచూపును విసరె ; నొడిసెల
గోరివిసరిన మచ్చుదెలియగ ;
నారహికి గురిసున్న.

అయిన నందం బంతులేనిది ;
అందఱకు నది అంతొ యింతో
యందు బాటన్నట్లు, తగిలిన
దావిసరు పిసరు.

## బల్లకట్టు

ఈవ లొడ్డుకు పట్టు - అవలి బల్లకట్టు
పొలములో నా బావ - తలపోయు చుంటాడు
' మద్దాన్న ' మైనాది - పొద్దుమీదున్నాది
వెచ్చ నన్నముకూర - పచ్చడి తలమోతు
కుప్పనూర్పుడు ' కాడ ' - ' కొప్పడుతూ ఉంటాడు '
గున్నమామిడిక్రింద - నన్నెంచు కొనుచుండు
దారిపోయేవారు - ఏ రోజు, నుందురు ;
ఊరిలోనిదాన - ఈ రోజె మహరాజ !
ఈవలొడ్డుకుపట్టు - ఆవలి బల్లకట్టు.

## సంవత్సరాది

క్రొంగ్రొత్త యేడాది కొసరించుపొద్దు
తెలతెలవాఱులో దేటగన్పట్టు
తలయంటుకొనిరార! తొలికోడికూత
నేరు సాగింతాము పాలేరువాడ!
పేరుబ్రోగింతాము పెదరైతుప్రోడ!
పచ్చపసుపురాచి యక్షతల్ వోసి
చందనాదుల నెంతొ చక్కనర్పించి
వరిచేలు పండేటి పల్లంపుమడిని
చెఱువు నీరెక్కేటి చిన్నారి నడిని
ఏరు సాగింతాము ఏటి తొలుదొల్త!
నవరసంబులవేప పువుపచ్చడులను
చవులుట్టిపడునట్లు నవధాన్యములను
కొల్లగాబండించి కోర్కెలందుదము
నవ వసంతునిచెల్వ నవకంబులరసి
తొలకరి మెఱపుల దొంగిలింతాము.
ఇంటబుట్టినగిత్త జంటచిఱుమువల
మీట, బొబ్బిలిపోతు మీదబడునవల
నాగటి చాలుతిన్నగను జూడివల
చల్లు విత్తనముల నిల్లునిండాలి
పొల్లుగాయయులేని పొలికలగాలి.
పాతాళ గంగకు బాఱాలివేరు
ఆకాశ గంగకు నంటాలివెన్ను
శీతకాలపుబంట సిరికిదేత్రోవ
తాత ముత్తాతల తలదుక్క చలువ
ఇనుమాఱు ముమ్మాఱు నెర్వోకసాగ.

నేరు సాగింతాము పాలేరువాడ!
పేరు మ్రోగింతాము పెదరైతుప్రోడ!
ఏటికేడాదియు నింపుగాజూడ
నేరు సాగింతాము పాలేరువాడ!
పేరు మ్రోగింతాము పెదరైతుప్రోడ!

## రంయి - రంయి

ఏటిగట్టు - నెవిగియున్న - తెల్లుపొదలు - రేగియూగ
రంయి రంయి - రప్పు రప్పు - చెవులు తడక కట్టునట్టు
పెద్దపెట్టు వీవవొడగె - క్రొత్తనీటి యీదగాలి
మబ్బుముఱుగు - మసకపొద్దు - నెత్తిమీద నిలిచియుంట
తేరిచూడ నేరమయ్యె.

రేవుపడవ దేవునిపయి - భారముంచి పయనమయ్యె
చాప జంయ్యి జంయ్యి నీట - తడసెననగ దట్టువంచె
చుక్కానిన్ - గాసేవాడు - చిక్కబట్టె - చేతికొద్ది
తన్నిపెట్టె దాపలికాలు.

మొలను వెండి బిలలత్రాడు - మొదలకు తెగి మోసమైన
పడవనడుపు పంతమెసగ - పట్టునట్టె పట్టియుంచె.

దూరమునను దుబ్బులందు - చాటుచాటు చాయలందు
డొంకెనలను వంకలమర - పేదరాండ్రు వేఱు వేఱు
నిలిచి క్రొత్తనీటియందు - కొట్టుకొనుచు గట్టుజేరు
పుల్లపుడుక ప్రోగుచేసి - గుట్టగాను గూర్చుకొనుచు
రేవు పడవ దేవునిపయి - భారముంచి పయనమగుట
చూచుచుండి చోద్యముగను.

వారి పనిని వారు మఱవ - వారి చేతిదొంకెనకఱ్ఱ
లత్తై నీటిసంటి తేల - వారి కురులు పాయచెదగ
వారి చెఱగు పాడితప్ప - వారు చిత్రపటములట్లు
సొగసుగాను చూచిచూచి - నగిరివారు నావనెంచి.

నావ మనిషి నవ్వునెంచి - " నా వశమా నీ వశమా ?
నవ్వేభామా ! నవ్వో పడుచా ! - గోదారి యీవగాలె
ఎగిరిపోవునింక జెఱగు - తోసుకువావు తొట్టిపడవ "
అనుచునాడె నాసువనగ - ఆవలొడ్డు నావచేరె.

# రంగంనుంచి

రంగంనుంచి వచ్చిన రంగని రంగులు విన్నారా ?
రంగని పెళ్ళాం రామికున్న హంగులు గన్నారా ?
ఊదా కోటు మోల్మైను పెట్టె ఓడనుదెచ్చాడు
రాదారి పడవెక్కి యింటికి రంగడువచ్చాడు
పట్టిమంచం పరుపు బిడ్డ పఱతివచ్చింది
పుట్టిలునుంచి వచ్చిన నగనె మగనికి నచ్చింది
పచ్చని కొబ్బరితోటొక పందుం రంగడు కొన్నాడు
ఇచ్చుకువచ్చిన గుడిసొకలేసి కాపురమున్నాడు
నల్లని రేవడి తాతలనాటిది పల్లంజేశాడు
పెళ్ళాంతోడ కారెముతోడి ఆకుపోశాడు
సారువపంటను తెల్లవరిపురి మంచిది కట్టాడు
దాళువపంటకు సన్నవరిని దండిగబెట్టాడు
దూడ దుడికి దొరగారివి తాదోలుతుంటాడు
బేడపావల పెళ్ళాంతెస్తే పెద్దగతింటాడు
కళ్ళంలో ఒకనాడు వారల కాముడు కాసెనుగ
రంగని రంగులు రామి హంగులు ఏమో వ్రాసెనుగ
ఊదా కోటు రంగడుదీసి యెగురపోస్తుంటె
సాదా రైక చూసుక రామి చేటలందిచ్చె
పుట్టగోచి పెట్టిరంగడు రాశిచేస్తుంటె
కట్టుకో కెగగట్టుకరామి పొల్లుతోసేసె

చుట్టిన పాగను ముట్టకరంగడు చెమటలోడిస్తె
　　పెట్టిన కాలిచుట్టును గొలుసును రామి సవరించె
బంగరు పంటనిత్తెపుసిరిని రంగడు కొలుస్తుంటె
　　వంగుని ఓరే చీపిరికట్టను రామివడి తుడిచె
సంజరంగుల రామి మొగము రంగడు దాస్తుంటె
　　ముంజె బెక్కుల రామి దొంగకాముని కాసింది.

## కూలియన్నల కుతుకము

మొగములను ముచ్చెమట లూడ్చుచు
మూపులను పెనుమోకు నీడ్చుచు
మడమలెత్తున మన్నురేచుచు
గుండ్లపేరూ కులుకుపాటేమో ఏమో—
పాలిండ్ల బగడపు గుండ్లపేరేమో ?

　　ఇనుపబరువుల " నిస్స " యనుచును
　　వెచ్చనన్నపు వేళగనుచును
　　పెట్టినడ - కట్టుసుఖము గొనుచును
　　కాళ్ళకడియాల్ కలికి నుడియేమో ఏమో—
　　కడియముల సడిభిడియ పడుటేమో ?

నడలు నడికట్టొడియ నెట్టుచు
వీడు సిగముడి వ్రేళ్ళబెనచుచు
అలసటలు వోనడుగు నాపుచు
వలపుజిమ్మెడు పదముగలుపేమో ? ఏమో—
పదముకడ పొదరింటి నిలుపేమో ?

　　ఎదుట కుట్టది యేదిలేదు
　　మోహపడుటకు - ప్రొద్దుకాదు
　　మఱుగువెట్టగ మఱుపురాదు
　　కూలియన్నల కుతుకమదియేమో ? ఏమో—
　　బాళితలపని పెరిమయదియేమో ?

## తొందఱపడెదేలా ?

తొందఱపడెదేలా ? (ఓలే ! ఏ ఏ ఏ)
సందెలపడలేదే ?॥
బందను ఆ కూడ్వ (అయ్యా ! ఆ ఆ ఆ)
అందెలు బాడయ్యె॥

ముందఱకాలువను (ఓలే ! ఏ ఏ ఏ)
చందురుతెలి సిరే॥
పాలికిజేసేని (అయ్యా ! ఆ ఆ ఆ)
కూలికి రాలేదు॥

సాలికి నొకసారె (ఓలే! ఏ ఏ ఏ)
'పోలికి' - పాలమూడ్పు॥
దాలిని బుగ్గోసా ? (అయ్యా ! ఆ ఆ ఆ)
మాలను " ఒగ్గే " సా ?॥

## అందఱి కంటెను ముందు

అందఱికంటెను ముందు అరయుదుగాకను కొనుచుం
తొందఱగను నేవచ్చితి తొలివేకువనే లేచి
సుందర సూర్యోదయ శోభా !
మందునిగాసను జూపితి.

నేను వచ్చుసరికి నొహెూ రాజును దీపించియుంటి
నదిపైగల దిబ్బండల హరితతరు వ్రాతములో
సుందర సూర్యోదయ శోభా !
ఎందఱొ నినుజూచి రపుడె.

పల్లెవాడు పాలముకాపు తలమోతను పెఱుగమ్మ
గొల్లపడుచు చలిలోనే కులుకుచు నిను జూచిరిగా
సుందర సూర్యోదయ శోభా !
మందుడనే వారికంటె.

# సంతనుండి

నడుమువంగిన ముసలిమానిసి
నేల - చూపుల జాలిగొలుపుచు
పొడుగుబాటను నడచుచుండెను
వానిచేగలకఱ్ఱ నాతడు
నేలనానుక లాగునడ్డికి
సుఖముగూర్పగ క్రమక్రమముగ
జబ్బసందుల నిఱుకజొనుపుచు
ముందుబాటను ముదముగనియెను
ఎనుబదేండ్లో తొంబదేండ్లో
ఉండునతనిక, ఉత్తవయగే—

" ఎచటుకేగితి తాత ! నీవు
ఏడబోతివి తాత ! నీవు "
" సంత కెళ్ళి మళ్ళు చుంటి "
" సంతలోపల నేమికొంటివి "
" ఉప్పు కల్లు మిఱపకాయ "
అనుచునె అతడంతలోన
జబ్బలను నిఱికించినది తా
వెలికదీయుచు నేల నానుక
నేలచూపుల జాలిగొలుపుచు
పొడుగుబాటను నడుచుచుండెను.

మఱలనే ' తను ' పలుకరింపక
పోయినను ననువెంట దఱుముచు
పిలుపుగొలుపుచు " తండ్రి ! పైబడె
నూటికొకటొ రెండొ తక్కువ

ఎంతకాలంబిట్లు బ్రదుకుదు
ఏమిలాభంబనుచు నడిగెను "
ఏమిలాభంబనుచు జెప్పుదు ?
నెంత కాలంబనుచు జెప్పుదు ?
" సంత సంతకు జనుచునీవు
సంతలోపల ఉప్పుకల్లు
మిఱపకాయయు కొనుక్కొనుచును
ఎంతకాలము సంతలుండునొ
అంతకాలము బ్రదుకు మంటిని. "

## పొలము బయలున

అప్పుడె పాడిన దందపు - పాట
అప్పుడె యూడ్చిన దా కడచేను
చఱ చఱ నడచుచు చక్కని కోన
మఱలుచువచ్చెను మైమైజాన.
మళ్ళగట్లపై మసలిన వీక
నసురసంజగా నగపడు చక చక
ఎగగట్టిన చీర్దిగదియ్యక యే
విడుముడి రైకను బిగగట్టకయే
విచ్చలవిడిమై వచ్చుచునుండెను
అచ్చపు - పాటొకటను కొనుచును వే
మమ్మొలజూచెను - ఏమిటి తోచెనొ
ఆలా ఆలా కొబ్బరిమాకుల
చాటున నేనట బాటకువడి
దాటుచు దాటుచు తన వారలలో
దబ్బున గలుసుక తప్పించుక చనె
పాటకు సిగ్గా ? పడతికి సిగ్గా !

# ఒక వేసంగి యపరాహ్ణవమున

రావియాకులంతరాళ మందాడే గాలిలేదొ
రావిచెట్టు క్రొత్తచిగురు రవములింక నేరలేదొ
భావమెల్ల రావిక్రింద నీడపట్టు పట్టియుండె
నీడచలనమందె మనము నేర్పుజొచ్చెగాన రవము
నీడల నెడునక్కఱములగూడ బలుకుకొనుచు బాట
తీయములను లోకమునకు దివ్యామృత మట్టులిడునొ,
కోకిల యొకటుండియుండి కోనముఖరితంబుగాగ
కో కో యని కూయుచుండె గొమ్మలసడి సన్నమోవి
'తే తే లోడుగ్రుచ్చి' యనుచు, లేగదూడవెంటబడెను
స్వేచ్ఛదిరుగు నాలపోతు వెంటనుండ్రి బాలురాట
మండుటెండ మిసిమిమబ్బు మైమఱపుల నప్పుడపుడు
నిండుచూపులకును సుంత నిదురదూగునెమ్మి గొలిపె
లైలమ్మయను జోలపాట లాలనముల బల్లవెత్తి
పాటిమట్టి తోలువారు పల్లెనడుమ బండ్లదిగి
బండికొక్కరిరువురు పెవ పెండ్లివారిబలెను దిగిరి
చండతరపు టెండవేళ సన్నసన్న పాటలతో
అందఱుదిగినారుకాని అందుననొక పడుచుపిల్ల
ఎందుతాను నున్నదియొ యెఱుగనంతటి గాఢనిద్ర
వోవుచు దిగకట్టెబండి పొట్టిగడు కొయ్యనంటి
సోలియుండె సొమ్మసిల్లి చుట్టునెండకాయుచుండె
పాటుపడ్డప్పుడేని దాని మోటునొసటనంతచెమట
పోసియుండలేదు 'లే' 'లే' 'ఓసి' యనచు దోడివాండ్రు
పాపమనక కూలియాండ్రు లేపినారు పెద్దకూక
నిట్టెలేచి తలనునెత్త - నెత్తలేదు లేవలేదు
పిల్లకొప్పు బండికొయ్య బెనచికట్టె బండితోలు

కోడెకాడు వాడెయనగ - చేడెమూచె బింకెననెలి
కోడెకాడు కొప్పువిప్పె - కొప్పువిప్పి కొసరిపలికె
" కట్టె నెవడొకలనుజుట్టు - తట్టునెత్తుకొ త్వరగవచ్చి "
వన్నెకాని మాటనిజమొ - స్వప్నసమ్మోహనంపు
వేసంగి యపరాహ్ణమదియ

## గొల్లవాడ! పిల్లవాడ!

" గొల్లవాడ! పిల్లవాడ! గొడ్లకడల కుఱ్ఱవాడ!
గోదారిలోన గడుగ నీ యొడలి ధూళియేత?
గోళికాయలాడినావ? గూటిబిళ్ళలాడినావ?
కోతికొమచు లాడినావ? గొడ్లనెల్ల విడచియిచ్చ
చీమచింత చెట్లక్రింద - చెలగియాడిచెలరేగి "
గోదారిలోన ఈతాలాడు కొనుచునుంటివటర?
" కాపుగారు! కన్నదొరలు! కాదు కాదు లేదు లేదు
గోళికాయ లొడ్డలేదు గూటిబిళ్ళ మీటలేదు
కోతికొమచి దుముకలేదు గొడ్లనెందు విడువలేదు
గొడ్లనేను తోలునపుడు గొడ్లవెనుక నడచునపుడు
గొడ్లగిట్ల రేగినట్టి గొప్పధూళి యొడలిగప్పె
గోదారి నిపుడెడగితి గొడ్లవె! యవె! యవే! యవే!

## ఎక్కడున్నావోలె

" ఎక్కడున్నావోలె! నీవు "
" అక్కడె ఆ యింటిలోనె- ఆ అద్దాల మేడలోనె?"
పక్కున నవ్వుచుబిల్ల - ప్రక్క సందులోని కరిగె
టక్కరి ఆ కోడెకాడొ - చక్కపోయె రాజుబాట
అద్దాల మేడ యేంటొ? - ముద్దరాలి జాడలేంటొ?—
కప్పుతూట్లు వడ్డగుడిసె - నుప్పులేని కూడుకుడిచె
తప్పతాగి వాడువచ్చె - తుప్పతల పసందుమెచ్చె.

## తీర్థపు సరదా

ఎందుకీ మూతివిఱుపు - ఎవరిమీదనో పడతి
ముందుతీర్థములోన - పూలంచు చీరకొంట
పదపద పడవెక్కు - పాటువేళ తప్పునంట ...ఎందు

అందగాడ! అలాగుననే - అసపెట్టి తీసికొస్తి
పాలకొల్లు సంతలోన - నీలిచీర కొందునంటి
నడిపించినావు నీవు - వడివడి కాల్పగట్టి ...ఎందు

పెరవలి లాకుకాడ - తగిలె దాని ముండమొయ్య
రహదారి పెద్దపడవ - రాతిరాగు దామటంటె
కడువడి నడుసునంటి - కాస్త లెక్కకేమిటంటి ...ఎందు

నీటు కాడపోనికాని - మారుకేరు సత్రములో
మంచిమాట జేసికొనగ - ముసలినామ లేప నిన్ను
ప్రొయ్యిరాజకీ నాకళ్లు - పోయిన మాటాడవైతి ...ఎందు

రాతిరల్ల దారిపాడవు - రమణి నడచి యలసితేమొ
పెనుగొండ రేవుదరినె - పూటకూటి యిల్లటంటె
కూరతేర పైయూరిలో-కూడువండి పెడుదుననవె...ఎందు

వన్నెకాడ! మాయమాట - తిరుగుజట్క సలుగురెక్క
అయిదు నీవు ఆరు నేనని - అందులోనె ఇఱుకుమంచు
ముప్పుతిప్పలు పెట్టినావు-చెప్పుకొన్న సిగ్గు సిగ్గు ...ఎందు

సాగరాల జల్లులాట - సరిగంగ స్నానమాడ
వేగువేళ వేడుకనవే - వేగబోవ వలదుయు ననవె
రవలబండి మువలగుట్టం-చిటికవోవ తలపుగొనవె...ఎందు

సొగసుకాడ! నన్నుచూడు - ఆవ లంతర్వేదిచూడు
పోటువేళ - తొట్టిపడవ దాటబెట్టు నేటిపెండ్లి
తొట్టి పడవ వద్దువద్దు - గట్టిమూత కూసెనెదియో...ఎందు

కూతవిన్న గుండెబెదురు - కదలుచున్న కంటికదురు
నావమాట లాడినాను - నాణెముగ తెరచాపవోపు
తప్పదూ చీటీనితెస్త - వెలుగుచాయనుండువస్త ... ఎందు
ఓడనెక్క చీరలేదు - నావనెక్క రేవలేదు
తీర్థమున కీ తిరువచ్చు - తెఱవల ననవలెనుగాక !
వెలుగుచాయ బైటజాఱ - వెన్నెలనవ్వేదవరాజ !... ఎందు

## విహారపు - తావు

విహారమున కేగునపుడు - విశ్రాంతిగొనుతావు కలదుచివర
చక్కనగు చిన్నారితావుదానిన్-చేరుటకుదారివరిచేలనడుమ
చేలనడుమనునడుచునప్డు- పచ్చనగుచేలరంగచ్చెరువిడు
కమ్మనగు పాలవాసనలు - చెలగు దారినే పట్టిపోవ
పంటకాలువ గట్టుతగులు - గట్టుపైగలవు పాదుల్
బెండలూ - బీరలూ - కంది కలగలుపులూ.

పంటకాలువ నీటగలవు - నిడుపులగు జమ్మికొసలు
మఱుసొగసుపూల పసలు - చల్లచల్లని గాలికూనల్
దొంగతనముగవచ్చి తగులు - నొదలిపై చెమ్మటాఱు
నెంతయును సేదదేఱు.

రయితొకడు కానరాడు - కూలిపడుచైన జనదు
పాలికాపందుబోడు - అశ్వయుజ మాసంబులో
ఊడుపులు అయినవెనుక - ఆ తావునందు నిలువ
అత్యంత నిశ్శబ్దమై - హరితసస్యాఢ్యముదమై
కనిపించు చుట్టుపట్లు.

ముమ్మరపు టూడ్పునందు - గుమ్ముమన్నట్టిపాటల్
ఈ నేటిశోభనడుమ - మానితంబైన స్మృతులన్
గొలిపిహృది గొసరి కొసరి - ప్రతిరుతింపంగసేయు
పైరుతలలూగుసుంత - క్రొత్త వెన్నాడు కూంత !

# రస్తా మరమత్తు

బండ్లుదిగి నడవండి వీటికి
గుండ్లపై బడకండి నేటికి
రహదారి ఎగుడు దిగుడులు
మహారాజుల మరలబండ్లను
నునుపుగను జేసేము మేము
ఇనుప తిరుగుడు గుండ్లను ...బండ్లు

ధూళి దుమ్మును నెత్తిమోసిన
తోడబుట్టుల మన్నలారా
రాళ్ళు నీళ్ళను కలిపి మొత్తిన
కూలిపడుచుల మక్కలారా ...బండ్లు

గున్నపొన్నలు తీయమావులు
కూళ్ళు తినుమా చలువతావులు
దారిప్రక్కనె చనెడు కాలువ
దప్పికార్చెడు కామధేనువ ...బండ్లు

ఎఱ్ఱదీపము నల్లబల్ల
యెఱుకప్రాతల హద్దులోపల
పెద్దమోకును లాగుకొనుచును
సుద్దులాడుచు బాడుకొందము ...బండ్లు

ఎవ్వరీనడబాటసారులో
అవ్వలకు నొత్తిల్లియుండుడు
మాటమొగమోటమ్ము లేదిట
మట్టి కంకఱ తగులు కాలికి ...బండ్లు

ప్రొద్దుపొడుపున వచ్చువారము
ప్రొద్దుపొడుగున లాగువారము
ప్రొద్దుకునుకున బోవువారము
అద్దిరా! అదె మార్గమనుకొన ...బండ్లు

## కొత్త పాట

" ముప్పావులా కూలొస్తది - నాయుప్పరాయె
కొత్తలోకి కూలికెడదాము - కూకుండుంటె కూడొస్తదా
నాయుప్పరాయె - కొత్తలోకి కూలికెడదాము "

బంపరద్దకంపు - చీర - అందముగను - కట్టుకొని
కుంచనంపు - కుత్తికంటు-నుదురుగమెత్త సదురుకొని
దారి తంగేడుపువ్వు - తలను ఒద్దెపెట్టుకొని
కులుకుమోమునందు-కలికి! - కుంకుమ బొట్టద్దుకొని
కొత్తలోకి కూలికెడదాము - నాయుప్పరాయె
కొత్తలోకి కూలికెడదాము.

శీతకట్టు ప్రొద్దుటెండ - వెచ్చవెచ్చ - కాయుచుండ
"నిదురగనిక" "నీటగనెరు"-"ఆపుడాకు" "తూటికాడ"
తేమ దెమలి తీగసాగెను - చెఱువులో - చెంగలువలూగేను
తియ్యముయ్యేటి బ్రమల - రొయ్యచాఱ ముయ్యొడమూగ
కుండతూరదొరువు మ్రోగేను-నీమగిని-కూటి-కుండకేమి
కొత్తలోకి కూలికెడదాము - నాయుప్పరాయె
కొత్తలోకి కూలికెడదాము.

చలిదిముంత కలియె గంజొ - నెత్తి దొంకకుండ నిలిపి
కొడవలి పిడినొడుపు గొలిపి - అంచుల చెఱగట్టె మలపి
తోడివాంఛతోడు గలిపి - కొత్తలోకి కూలికెడదాము
నాయుప్పరాయె - కొత్తలోకి కూలికెడదాము.

చిన్నిచిన్ని మంచుబొట్లు - సన్నవరిముల్లుమీద
మాపునిల్చి తేపు రాలెను - మొన్నబట్టిన గాలివాన
మునిగినట్టి ముదురుచేలు - నిన్నమొన్నవేసినట్టి
కొండగాలి కారిపోయెను - తెరవుమఱిగి - వెరవు లెఱగి

పఱిగపిట్ట బారులేగె - బేగిలెగిసో
యప్పరాయె - కోతలోకి కూలికెడదాము
నాయప్పరాయె - కోతలోకి కూలికెడదాము.
పైటలోని అమ్మగారి - పచ్చి పగడముల పేరు
తొంగిచూడ వంగికోతాము-గాజులులియ-పనలు దూతాము
నేలపాడవు పండవేతాము - కోసినట్టి కొడవలికిని
చొవ్వవెన్నచుట్టపెట్టి - బుజముపైన ముఖమునుంచి
కుచ్చవెన్న కొసరియాడ - మళ్ళగట్టె మళ్ళివత్తాము
కాలి-మట్టె-టక్కు-టిక్కు-సంజ-పాగ-మంచు-చాయ
వీటియొద్దె యింటికొత్తాము - సీ యొప్పచూడ
ఊరువాడ - కోతలోకి కూలికెడదాము
నాయప్పరాయె - కొతలోకి కూలికెడదాము.

## చిన్ని గీతికలు

చిన్నిపువ్వు చిఱుగాలికి జెలగి యాడెడున్
పెద్ద చెట్టు పెనుగాలికి విఱిగి పడియెడున్
పొడుపుటేరు తొక తొకరుతి పోక పోయెడిన్
పొడుగుకొండ మూకలాగు మూల మఱిగెడున్
రేనిజుక్క మినుకు మినుకు ప్రేమ లీనెడిన్
పగటి పొద్దు మండు టెండ భగభగ మనెడిన్
నలికమంద మృదు మధురము నయన రమ్యముల్
తెలియరారె చిన్ని గీతికల నగమ్యముల్
ఎమ్మెకాని ఎలనగవులు, కన్నెపడుచు కనుసన్నల్
ఔర! బట్టబయలైయైన నతిరహస్యముల్
రారె తెలియ గ్రొత్త కయిత సౌమనస్యముల్..

# పేరులేని చిన్నిపువ్వా!

పేరులేని చిన్నిపువ్వా! దారిప్రక్క చిన్నిపువ్వా!
గట్టుపొడుగు గడ్డిపచ్చ - పూసినట్టి చిన్నిపువ్వా!
వానకాలు వచ్చినట్టె - వానమబ్బు పట్టినట్టె
పూయుచుందు ముమ్మరముగ - నామది నానందమిడుదు
పేరునీకు బెట్టరెవరు - పసులకాచువాడా! దీని
పేరేమీ యోరియన్న - గడ్డిపువ్వని అడ్డంగా
తనదు పసులదరికిదోలు - పడవలాగే వడిగలవాని
అడుగుదునా అపుడెవాడు - ముందునడక ముసలగుత్తి
కళ్లనెత్తి కదియమొత్తు - పెద్ద పెద్ద పిన్న పిన్న
పండితులవలనదెలియ - మల్లెపువ్వ మంకెనపువ్వ
ఏదొపుట్టి యిలనుగిట్టు - వట్టిపువ్వని పాఱవైతురు.
పేరులేని చిన్నిపువ్వా! దారిప్రక్క చిన్నిపువ్వా!
గట్టుపొడుగు గడ్డిపచ్చ - పూసినట్టి చిన్నిపువ్వా!
నీళ్ళుముంచు నీలవేణి - వెనకాతలె వెళ్ళివెళ్ళి
నునుమెఱుగున జినుగువన్నె - ఎఱుపు పసుపు వేరుపడగ
తుఱిమి పేరు తోచదన్న—
పడతి తీసివైవలేదు - తడుమునంత తగులనీవు
మల్లెమొల్లో మఱివిరజాజో-బంతియొ చామంతియొ యని
అట్టె దువ్వినట్టి కురుల - బొదివికొనుచు పొదుపుకురుల
పువ్వునూడ బుచ్చునంత - చెడునటంచు చేతపట్టి
వీరివారి పేరునడుగు - పేరులేని చిన్నిపువ్వా
వెలయుదీవు పేరు లేకె—

## ఎఱ్ఱ ఎఱ్ఱని సంజ

ఎఱ్ఱ ఎఱ్ఱని సంజ - నల్ల నల్లని పిల్ల
పచ్చ పచ్చని గడ్డి - కోయు చుండెన్
చేను - మూయుచుండెన్ - కాపు - డాయుచుండెన్.

చూపులొడ్డని సొగసి - పాపమొల్లని పడుచు
పాపటొత్తని బాల - చాటునొదిగెన్
దొంగ - మాటు నణగెన్ - చేతి - పాటు వదలెన్.

తలకుజుట్టిన పాగ - మొలకుగట్టిన పంచె
కిఱ్ఱుపెట్టినజోడు - సర్దుకొంచున్
రైతు - దిద్దుకొంచున్ - పెద్ద - సద్దుచేసెన్.

ఇట్టె కొడవలిగోసి - పట్టెడౌ నెడదూసి
కట్టుమీదనువేసి - రెవరో పరక
లదురు - బెదురులేక - ఎదురు - పడరె పోక ?

అతడు దారిని గాచె - అడుకూతురు చూచె
అడుగు తడబడజొచ్చె - కాపు కనగన్
గడ్డి - మోపు గొనగన్ - పంట - రాపె చనగన్.

జొన్నమొలకలచాటె - సన్న సన్నగ దాటె
మారు నారవయాటె - దంటబిల్ల
రైతు - కంటబడియెన్ - పరక - లాంటె ఓలె !

తురక బొంబయి రైక - నీలియంచుల కోక
మాయు యందెల రాక - రామ చిలుక
ఇవిగొ - పరకలనియెన్ - ఎందు - దొఱక రెవరున్.

## సంకురాత్రి

సంకురురాతిరి సంజవేళ - సారంగుని మెట్టకేగి
తిరిగివచ్చుచునుండె గ్రొత్త - పెద్దెడ్లబండివాడు
రెండెడ్లబండివాడు - మంగళారపుపేట సాంబడు
నల్లచొక్కా తొమ్ముపైని - నాణెంపు కాసుబొత్తాల్
మెఱయగను తన రెండు చేతుల—
తోకలను మెలివెట్టి చల్ చల్—
అనుచు దోలుచునున్నవాడుగ - వీరభద్రాపురపుబాయనె
బాటధూళి చెలంగ - భళిరా!
వెనుక కొకమాటిట్టెచూచుచు-పిన్ననవ్వును నవ్వినాడుగ-
అల్లనవ్వనె అరసినాడను—
బండిలోపల-పిన్నపెద్దలు-పదికిబైగానున్నవారల
కందఱకుదా ముందుగూర్చుని-సాంబనిపై జూడ్కినిలుపుచు
నవ్వనకు మఱునవ్వ నవ్వెను—
కులుకు కుఱ్ఱది-కూరలంగడి-వెలగపండ్లమ్మెటి శ్యామల
వెండియొడ్డాణంబుపైపై - కుత్తికంటు పసిండిలోలో
మెఱయబువ్వుల కొత్తకోకను - ముఱియుచును గట్టినది
ఎప్పుడు—
సాంబడును శ్యామలయు భార్యాభర్తలని ప్రజలెఱుంగ
రిపుడో—
మందహాసపు మధురదృష్టిని-అందఱికినెఱుకయ్యెనో హో.

## బాతుల జంట

నిండువఱదలో నిద్దంపుజంట
ఉద్దిగ నీదెడు ఒఱపులజంట
పలవపు ముద్దుల పక్షులజంట
పరిశుభ్రపు దెలివన్నియజంట

ఆకాశముపై నందపుమబ్బు
నీటిని మోసెడు నీలంపుమబ్బు
చల్లనిగాలికి సాగెడుమబ్బు
మబ్బులనీడల మసలెడుజంట
బాగులదూగెడు బాతులజంట

ముక్కులనీరము పొడిచెడునుక్కు
ఱెక్కలసర్దెడు ప్రేమపు డెక్కు
రాలవిసర గట్టెక్కెడుటక్కు
ఇంటిచూపుచను ఇంపులచొక్కు
చక్కని బాతుల సరిపడుజంట

ఎంత మోహనపు టీక్షణసుఖమో
ఎంత శాంతమగు ఇష్టార్థంబో
ఇంతకు నంతకు నిలనవి రెండే
జంటగ నున్నటు చాయల దోచెన్.

## నది కడ

నదిలోన తెల్లుదుబ్బు-నవ్వుచుండె దెల్లపువుల
నదికావల-ప్రొద్దుకునుకు-ప్రేమగ్రోలిపె నెఱ్ఱజిగుల
నదికుత్తరమందు గిరుల - మెఱసె మొగులు కఱవుదీఱ
నదికి దక్షిణమునలంక - లొప్పుచుండె నొక్కపచ్చ
నది కీవల నేను మదిని - ముదముగదుర నిలిచియుంటి
నదినాడు నాకనుల - సవ్యశోభ నందగించె
నాముందఱ గోదావరి - నాకథునీచిత్రమయ్యె
అలలపోవు చిన్నిపడవ - నరపతిగద అచ్చఱబలె.

## ఒక మనస్థాయి

పలుమాఱు నునసునకొక - ప్రణయంపు బలుకుతును కొ
ప్రేమ పూరితపు బనియో - మధురహాస భరిత మననమో
నడకనొ మఱి మన్నకనే - పండుకొన్న విశ్రాంతినొ
కలనో యుదయపు వేళన్ - మెలకువగొను తొలి తఱినో
మొదలు తుదను దోపింపగ - ఎదకుదట్టి పెదవులపై
నుదయింపంగను సేయున్-కొదమనవున్-హా! అవ్యక్తమొ!
ప్రియురాలెవ్వతె యనుకో - దయితుండెవ్వడొ తలపన్
ఏవిదూషకుడొకనబో - స్థూలదృష్టి మఱిదోచదుగా
లీలగన నదియటెచనుగా - కాలములో వెనుబడుగా
ఆ నడకనె ఆశాంతినె - ఆ కల నా మెలకువనే
అట్లే పెదవుల నడుమనె - మటుమాయంబగు నవ్వు
నవ్వ నట్లె యుండునుగా - నవ్వనట్లె యుండునుగా.

## కలచూపు

మృతిని గన్నటువంటి ప్రియులను
బ్రదికి యున్నటువంటి ప్రియులకు
చూపగల యల చోద్య మదెగా!
ఫలము దక్కని ప్రాలు మాలికి
ఫలముజూపెడు పారమదెగా!
విరహవేదన వేగుయువకున
కరయదగు నంజనము అదెగా!
కలను బోలినకంటి చూపొక
టిలను వేఱొకటె నగబోదుగ.

## గాలివాన

ఎంతకాలమునుండి క్రిక్కిఱిసి యుంటివో
ఈనాడు వెలువడితివీ-పెద్దగాలి-గాలివాన-గాలి
కప్పుపైగల పెంకు కాగితము పోలికను
ఎగురజేసితివీవు ఇట్టె ఇట్టె-పెద్దగాలి-గాలివాన-గాలి
చెట్లు వ్రేళ్ళకునంట శివమెత్తినట్టుల
ఊపిపెకలించితివి-ఉండియుండి-పెద్దగాలి-గాలివాన-గాలి
గట్టిగోడలు పడగొట్టినట్టులుగానె
కూలద్రోసితివీవు-బెల్లు బెల్లు-పెద్దగాలి-గాలివాన-గాలి
హోరుహోరుమంచు మఱకవేసినయట్టు మాఱు
మ్రోయించితివి-మాపుఱేపు-పెద్దగాలి-గాలివాన-గాలి
తుత్తునియలుగ ప్రాణిమొత్తంబులోయన మేఘాల
బఱచితివి మిన్నుమన్ను-పెద్దగాలి-గాలివాన-గాలి
చుట్టుముట్టి పెద్ద చోద్యంబు బలె నీవు చూపుగొల్పితి
వెంతొ స్వైరివగుచు-పెద్దగాలి-గాలివాన-గాలి
ఆపనెవ్వరివశము-అశాంత శక్తినా
హద్దుదాటితివీవు-అట్టె అట్టె-పెద్దగాలి-గాలివాన-గాలి.

## విరిమల్లె పూలు

విరిమల్లె పూల పాట - తరులెల్ల మ్రోయుబాట
రామయ్యొ చిన్నవాడు - రహదారి కోడెకాడు
తందాన తాన పదము - వారిని గాయుముదము
గంధంపు బూతలు మెడను - మందార పువ్వులు జడను
కుంతికి గానుకగోరి - కులుకుచు పాతురు బారల్
బలాక పాళిన్ బాలల్ - పాలాల నూడ్చిన మాలల్
సంతకు బోవు బచ్చు - సంతసమున దబ్బిచ్చు
ఊరికి వచ్చు చుట్టము - వారికి నిచ్చెదు కట్నము.

# ఓబయ్యా! ఓ బయిత!

ఓబయ్యా! ఓ బయిత! సొరకాయ కోతలు కోయకురా!
రాతిరి జిలివల వేసావా?
రొయ్యకు మీసము జూసావా?
జీలుగు బెండులు తేల్చావా?
వాలుగు పాడవులు కొల్చావా?
ఊతల నడ్డుగ పాతావా?
పీతల గంపెడు నెత్తావా?
గాలము వాడిగ గ్రుచ్చావా?
ఆలికి జేపల దెచ్చావా?
ఓబయ్యా! ఓ బయిత! సొరకాయ కోతలు కోయకురా!

# అంకెలు

ఒక్కడె దేవుడు - ఎక్కడ జూచిన
రెండు చేతులను - ప్రేమను మోడ్చ
మూడు వేళలను - ముదమారంగ
నాల్గు వేదముల - నట్టగ పొగడుడు
అయిదింద్రియాలకు - నందని వాడయి
ఆరు రుచులకును - సారము దానయి
ఏడ్గురు ఋషులకు - నెక్కుడు వాడయి
ఎనిమిది దిక్కుల - నెందును దానయి
తొమ్మిది గ్రహముల - నిమ్ముగ నడపెడు
పది యవతారాల్ - పరమేశ్వరు డత
డొక్కడె దేవుడు - ఎక్కడ చూచిన.

## నీటిబొట్టు

నీలసంద్రములోన నీటిబొట్టును నేను
నీలవర్ణమునాకు లేదు సుంత
నాతోడ బుట్టువులు నాయక్క చెల్లెండ్రు
జిగికెంపు పగడాలు సొగసైన ముతియాలు
రాణివాసపుటిండ్ల రాణీల మెడజిక్క
టక్కరి సాహుకార్ల సంచుకట్టులనక్క
జాలరి వలతట్ట జాడింపులను గ్రుక్క
చిప్పలను తిప్పలను జేరి చీకటి బొక్క

నేను నీరాలపై నీటుగా దేలుచును
శీకర డిండీర వీచిమరీచికల
మలయాని లాలోల డోలికా పాళికల
అశాంత వలయితానంత శుభసూచనల
నాడుకొనుచునుండు నాకసమునందు
అడుకొనుచునుండ నార్చు వేసంగి
వేలకొలది నదిగిన సూర్యకిరణాల
నొక్క కిరణముతోడ నెక్కుదునుపైకి
గాటంబు మబ్బులో కలిసి పోవుదును

ఉఱుముదును మెఱయుదును నొకకొంతసేపు
పంచవన్నెల యింద్రధనసు పట్టుదును
చాతకంబుల కాస చక్కగొల్పుదును
శీత వాతాంకుర స్నిగ్ధార్ద్రనౌదు
కొండలలో యల గొప్పయడవులను
మండుటెడారుల మైదానములను
చల్లని వాననే చాలగురియుదును

కురియుటలో నొక్క కొండపైనుండి
ఏరుగా ప్రవహించి యెటు పల్లమున్న
అటు మళ్ళి యిటు మళ్ళి యాశ తెలియకయు
అంత కంతకు బొడవు నధికంబునగుచు
ఆలోల కల్లోలమగు సముద్రమున
సాగర సంగమ శాంత విముక్తి
నీటి బొట్టునగుదు నిలంపుజేయు.

## పేరు

కాసులపేరు - వరాలపేరు
మోరీలపేరు - రూకలపేరు
అబ్బాయిపేరు - అందపుబేరు
బంగరు టుంగరు - ముంచినపేరు
తాతలనాటి - తఱుగనిపేరు
ముజ్జగములకు - ముద్దులపేరు
ఒజ్జలు పిలువ - నొహొూయనుపేరు.

## హనుమంతుడు

అంజనీదేవికి నాంజనేయులు పుట్టె
తొగరు ప్రొద్దు వొడిచె దూర్పుదిశను
పొడిచెడు కెంబొద్దు బొద్దుబిడ్డను చూచి
పండని తలపోసి పైకి నెగిరె
తోక నెత్తిపెట్టి దొడ్డగా గుప్పించె
నంతరిక్షమునకు నయ్యొ అయ్యొ
అంజనేయులు మూతి యట్టె తెగ్గాలిండి
హనుమంతుడైనాడు అంతనుండి.

## వినాయక

నిండైన గుజ్జుతో - తొండంపు మోముతో
చేట చెవుల ధాటి - మీటుకొనుచు
ఉండ్రాళ్ళమీదకు - ఒహొ ! బొజ్జకనకయ్య
దండు వచ్చినవాడు - పండుగనుచు
ఉండ్రాళ్ళ తిన్నాడు - ఒహొ ! బొజ్జకనకయ్య
కదలే కిట్టట్టు మెదలలేక
దొలుపుచ్చకాయట్లు - దొర్లుకొనుచుబోయె
జారి పడినవాడు - దారినడుమ
పొట్ట బ్రద్దలునయ్యె - పైనుండి పక్కున
చందాయి నవ్వెను సందెవేళ.

## మాతృలాలనము

విరిసెనచెట్టు పూలుపైని - పాలవెల్లి చిలుకలుగా
దాసిలచ్చి చిన్నబిడ్డనిన్
ఈతాకుల చాపపైని - తనదు గుడిసె ముంగిటన్
బట్టబయట బండబెట్టెను
ఎదరింటివారిసేవ - సేయబోలు దాసిలచ్చి
అయింటిల్లాలుపిలువ - లచ్చి తనదు గుడిసెనుండి
వెలికివచ్చి దారిలోని - బిడ్డనొక్కమాఱుచూచి
యిట్టెయెత్తి ముద్దుబెట్టి - ఆడుకోర వత్తునంచు
వెడలినదిగ వేగ వేగ - పేదరాలి వైభవంబు
ఆ లాలన మనతికాల - మాత్రమయ్యు నందగించె
పట్టుకుచ్చులట్టుపూచు - అలశిరీష కుసుమాంచల
సాంధ్యరాగ సమయమెంతనన్.

## ఆరుబయట

ఘోర సుస్థిరములై - కాఱు చీకటందు
ఎత్తు దున్నలట్టుల్ - మత్తగజములట్టుల్
దోచు పర్వతములన్ - వీచు చల్లగాలిన్
బఱగు నాకసమునన్ - గొఱలె చిన్నిచుక్కల్
దూరమందు త్తరం - బారయలో మన్నెం
తొలకరి మెఱపూనెన్ - కలకాలపు జూపై
ఆరు బయట పల్లెన్ - ఏరే నది సుఖమో
మడతమంచమందున్ - బండుకొంటి నొంటిన్
చెంత పేదయిండ్లన్ - వంతబాసి నట్టుల్
ఎడద చేతులెసగన్ - పడక గొనిరి గొల్లల్
వారియిండ్ల దీపా - లారిపోయెనపుడే
ప్రక్కమేకమందల్ - చక్కనిదుర నుండెన్
ఒకటిరెండు కుక్కల్ - వెకిలితనపు టార్చుల్
నకమొకములు వినగన్ - ఒకటసేయుచుండెన్
నాదు మనము నాదై - ఖేదసౌఖ్యములులే
కేదైవపు దయనో - సోదరసమమందెన్
చుక్కజూచులోనన్ చక్కగాలివీచెన్
ప్రక్కదిరుగునంత - టక్కరి మెఱపడరెన్
అరుబయట హాయో - ఆరేనది మాయో!

## ఉడుత - బుడుత

ఏయూరు వెడతావు-ఉడుత ! - మాయూరు వెడతాను-బుడుత.
మీయూరు ఎక్కడ-ఉడుత ! - మింట గొబ్బరిచెట్టు-బుడుత !
నీతోడ నేరాన ?-ఉడుత ! - నాతోక పట్టుకో-బుడుత !
పట్టుకొని నేవస్తె-ఉడుత ! - పుట్టినూ రగపించు-బుడుత !

కోనేరు మంచినీ-రుడుత ! - కొబ్బరి కాయనీర్-బుడుత !
నాల్గు వీధులుచూడు-ఉడుత ! - నలి కంపుటీనెలు-బుడుత !
పెద్ద కావులగాదె-ఉడుత ! - పెంకు కట్టిన కురుడి-బుడుత !
చెట్టునీడను సంత-ఉడుత ! - పిట్టల కలకలము-బుడుత !
పుండిపోమాయూర-నుడుత!-హూత్ అనకుమరినన్ను-బుడుత!

## పట్నవాసపు జిలుక

జామిచెట్టున చాల చక్కన పండ్లు
మామిడీ చెట్టున మఱి తియ్య పండ్లు
పండ్ల చెట్లనుబాసి పప్పులను కొఱుకు
పట్నవాసపు జిలుక పంజరపు జిలుక.

ఆకు పచ్చని కొమ్మనగపడని ఱెక్క
దొండ పండును బోలు తొగరు జిగి ముక్కు
కటకటాల నడుమ గడుహింస బొందు
పట్నవాసపు జిలుక పంజరపు జిలుక.

తోటకూరాయంచు మాటలోనాడు
చుట్టాలరాకలో జూపించు పేట
గండు పిల్లిని గన్న గపుచిప్పు నొదుగు
పట్నవాసపు జిలుక పంజరపు జిలుక.

రాముడూ ! రాముడని ప్రేమాన బిలువ
రాముడో! రాముడని వేమారు బలుకు
ఆ రామ నామార్థ మరయంగ బోదు
పట్నవాసపు జిలుక పంజరపు జిలుక.

## రాజు - రయితు

తలపాగ జుట్టుకొని తలపు లేమియులేక
పొలమునకు వెళ్ళెడిని రయితు
తలగడలలో బండి తఱుగని తలపోత
పొలిమేర దాటడే రాజు.

ములుకోల కఱ్ఱగొని ముప్పొద్దు నొంటిగా
కంచెజూచుకొనెడు రయితు
మొనవాడి కత్తితో ముందు పహరాకాయ
కంచుకము వైచుకొను రాజు.

ముతక పంచెగగట్టి మసురులో ముదముగా
నీరాల జేలకిడు రయితు
ఉక్కపోతను చొక్క నుస్సుస్సు రనుకొంచు
నేరాల దర్కించు రాజు.

మిఱ్ఱుపల్లములలో కిఱ్ఱుచెప్పులు మ్రోయ
పంట బండించుకొను రయితు
కఱ్ఱియేనుగునంటి కడుపు కక్కురితిగా
పన్ను గట్టుకొనెడు రాజు.

## ప్రాణికోటి బ్రదుకు సందడి

పడవనీటదేలి నడువ - పడపలోన బండుకొంటి
కూర్కలోన కోర్కెవింటి - పడవక్రింద నీటిరుతము
బండిబాట వడిగదోల - గడుకొయ్యను జేర్లబడుచు
ఒక్కకునుకు పాటులోన - వింతవింటి జక్రరవము
లోకయాత్రలోన సతము - అకసంబు నరసికొనుచు
శాంతతన్మయుండనుగ - చెవులబందువుగను వింటి
ప్రాణికోటి బ్రదుకుసందడి.

# పెద్దనవ్వు

ఆవనుండి జీవనదిగ - జాలువాఱు ఊటనీట
తాటిపట్టి వంతెనకడ - రేవులోన బచ్చుగడ్డి
తడుపువేళ పకపకపక - పట్టరాని నవ్వనగిరిగా
పొట్టపగులు నవ్వనగిరిగా !
మాలపడుచు లంగడిలో - గడ్డిమోపు లమ్ముకొనెడు
ఆడుపడుచులా పొలముల - గడ్డికోసి నడ్డిజోలి
వైచుకొనెడు పేదపడుచు - లొక్కపఱక నక్కయున్న
కొడవలి వడికోసి కట్టు - చీసుగొనెడు ఒంటిపడుచు
లావనుండి జీవనదిగ - జాలువారు సన్ననీట
తాటిపట్టి వంతెనకడ - రేవులోన పచ్చగడ్డి
తడుపువేళ పకపకపక - పట్టరాని నవ్వనగిరిగా
పొట్ట పగులు నవ్వనగిరిగా !
ఎచటనుండి అంతనవ్వు - పడుచులకును వచ్చినదో
తలనెత్తరు పలుకాడరు-పొలమునడుమ కొడవలితో
నిలువునున్న గడ్డికోయు - కోతకు కనుమూతలిడుదు
రెదుటనున్న ఎత్తుకొండ - చుట్టునున్న నిట్టతాళ్ళ
వారిపనులవ్వారిగాయ - మౌగ్ధ్యమూను మాలపడుచు
లంత నవ్వు నెట్లు నవ్విరో ?
ఎవరి చేనిలోని గడ్డో - ఊటకాల్వ ప్రక్కదనగ
మూటకాల్వలోన దడిపిరి - ఎండబడిన శ్రమల మఱువ
చల్లనీట నొడలు కడిగిరి - ముందులాభ మెంచనట్లు
చీరచెఱగు వారు దులిపిరి - మూడుపూలు ఆరుకాయ
లాపడుచుల కింకకాక - ఏలచింత ? ఏలమౌగ్ధ్యము ?

## శ్రీ కృష్ణ

చెప్పకు చెప్పకు బలరామా! - చెప్పకు చెప్పకు నాయన్నా!
చెప్పిన నీకళ్లోతాయి! - ఎప్పుడు మన్నిక నే తిననూ—
అమ్మా! అమ్మా! మన్నిదిగో!- తమ్ముడు కృష్ణుడు తిన్నాడే!
తిన్నాడే యిదె తిన్నాడే! - నోరు తెఱవు మను చూపింతు—
కృష్ణా! కృష్ణా! మను తింటే - తప్పుకాదురా! నోరేదీ?—
అమ్మా! నేమనుతినుటకును - కొంటిన ఆకొనియుంటిన? నా
నోరిదిగో మఱి జూడమ్మా! - ఆ రాముండన నంతియెనా?
అట్లనుచును శ్రీకృష్ణుండు - ఆవులించి నోరగపఱుప
చంద్రుని సూర్యుని జుక్కలను-జగములజనములసర్వమును
ఆతని బొజ్జను గనుగొనియె - అచ్చెరువుంబడె దల్లియును
కృష్ణా! కృష్ణా! శ్రీకృష్ణా! - భువనాధారా! ముద్దుకృష్ణా!

## సమాప్తి శ్రుతి

మేలగుత మేదినిం బ్రజలకెల్ల
బాలగోపాల హేలాసుశీలా
ఏనెలను వాన ముమ్మాఱుగురిసి
యీనేల బంట బండించుచాల
ఈతిబాధలు పుట్టకుండ
మాతండ్రి రక్షించు మఖిల మెవ్వేళ
విద్యలును విభవములు చెట్టబట్ట
యుగ యుగము ధర్మమును నిలుపులీల.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

సంపూర్ణము.

